# సప్తపది

[ రేడియో నవలిక ]

శ్రీమతి కనపర్తి వరలక్ష్మమ్మ
డా॥ శ్రీదేవి
శ్రీమతి మాలతి చందూర్
శ్రీమతి దుర్గాకుమారి
శ్రీమతి ఇల్లిందల సరస్వతీదేవి
శ్రీమతి కె. రామలక్ష్మి
శ్రీమతి పి. సరళాదేవి

విశాలాంధ్ర ప్రచురణాలయం, విజయవాడ-4

ప్రచురణ : నెం. 505
ప్రథమ ముద్రణ : జూన్ 1963
కాపీలు : 1250

వెల : రు 1-00

# కృతజ్ఞత



1959 జులై, ఆగస్టు నెలల్లో యీ నవలికను ధారావాహికంగా ప్రసారం చేసిన ఆకాశవాణి విజయవాడ కేంద్రంవారికీ, ఒక్కొక్క అధ్యాయాన్నే స్వతంత్రంగా పూరించి సమర్పించిన ఏడుగురు రచయిత్రులకూ మా కృతజ్ఞత.

— ప్రకాశకులు.

ముద్రణ :
స్వతంత్ర ఆర్టు ప్రింటర్సు,
విజయవాడ-4



# 1. తీరని సమస్య

కనపర్తి వరలక్ష్మమ్మ

రేపు బి. ఏ. రిజల్ట్సు వస్తాయని పత్రికలో పడగానే, ఎప్పుడు తెల్లవారుతుంది, ఎప్పుడు పత్రిక వస్తుంది అనే ఆందోళనతో రాత్రల్లా వేగించింది కమల. తెల్లవారకుండానే తమ్ముణ్ణి లేపి, స్టేషన్ దగ్గరకు వెళ్ళి పత్రిక కొనుక్కురారా అని డబ్బిచ్చి పంపింది. తాను ఇంట్లోకి బయటికీ పచార్లు చేస్తున్నది. అంతలో వాళ్ళ నాన్నగారు కూడా నిద్ర లేచి, వీధిలోకి వెళ్ళి, కుమారుడు తెస్తున్న పత్రికను అందుకొని, పరీక్షా ఫలితం చూచి, 'అమ్మాయీ! నీవు పరీక్ష ప్యాసయినావు' అని సంబ రాలు పడుతూ, వీధిలోనుంచి ఇంట్లోకి వచ్చారు. ఆ మాటవింటూనే, లోపలనుంచి రివ్వున వెళ్ళి, తండ్రి చేతిలో పత్రికను తీసుకొని, తన పరీక్షా ఫలితం చూచుకొని, 'అయ్యో! క్లాసు రాలేదు' అని ఉసూరు మన్నది కమల.

'అవునమ్మా! పెద్దపెద్దవాళ్ళ సిఫారసులు, అండలు ఉన్నవాళ్ల కయితే ఏ క్లాసైనా ఫరవాలేదు. మనవంటి వాళ్ళకు ఫస్టుక్లాసులో

ప్యాసయే అధిక్యతన్నా ఫంటే తప్ప, సీట్లు పుట్టడం దుర్లభమే!" అన్నారు, తన నిస్పృహతను నిరూపిస్తూ, తండ్రి.

కమల చిన్నప్పటినుండీ అతి చురుకైన పిల్ల. ఆమె ప్రతి క్లాసూ ఫస్టున ప్యాసై, మెరిట్ బహుమానా లందుకొన్నది. చదువులోనే కాదు; సంగీతం, నృత్యం – అన్నిటిలోనూ ఆమె ఫస్టే. ఆమె ఏది చెప్పినా ఇట్టే గ్రహించి వేస్తుంది. జగన్నాథంగారికి యీ కుమార్తె అంటే ఎంతో ప్రీతి. ఆమె కుశాగ్రబుద్ధి చూచి, ఆమె పరీక్షల్లో అగ్రగణ్యగా కృతార్థురాలు కావడం చూచి, తన కలిమిలేములు చూసుకోకుండా బి.ఏ. దాకా చదువు చెప్పించారు. సంగీతం, నృత్యం కూడా నేర్పించారు. తెలివితేటలకు తగినట్టు కమల యోగ్యురాలు. చక్కని పిల్ల కూడా. ఎన్ని యోగ్యతలున్నా తగిన వరుడు లభించితే కదా, ఇవన్నీ రాణించేది – అనుకున్నప్పుడల్లా గుండె గతుక్కు మంటున్నా, ఆ విచారం పైకి పొక్కనీయకుండా యింతవరకూ లాక్కొచ్చారు. "ఎప్పుడూ చదువు, చదువు అంటారు... పెండ్లి మాట పట్టించుకోరు" అని భార్య వెనుకనుండి సణుగుతున్నా పట్టించుకో కుండా తోసేసుకు వచ్చారు. ఇప్పుడు చదువు పూర్తి అయింది. ఇక కర్తవ్య మేమిటని అనుకున్నప్పుడు అంతా శూన్యంగా కనిపించింది, ఆయనకు. కమల, తాను థర్డ్‌క్లాసులో పరీక్ష కావడంచేత సీటు దొరకడం దుర్లభమని నిశ్చయించుకున్నా, మార్కులు తెప్పించి చూదా మనుకొంది. తెప్పించి చూచింది. మార్కులు సంతృప్తికరంగా లేవు. అప్పటికీ ఆశ తీరక, ఎం. ఏ. చదవడానికి దరఖాస్తు పెట్టింది. సీటు ఇవ్వడానికి వీలులేదని జవాబు వచ్చింది. కుమార్తె పై చదువు ప్రయత్నాలు విఫలమయినకొద్దీ, చేయవలసినదిక ఏమిటా అనే సమస్య తీవ్రమై, జగన్నాథంగారిని ఆందోళన పెట్టసాగింది. అదే ఆలోచిస్తూ వరండాలో పడకకుర్చీలో పడుకున్నారు. ఇంతలో ఆయన బాల్యమిత్రుడు కామరాజు వచ్చి, "జగన్నాథం! క్షేమమా?" అన్నాడు.

"ఓహో! కామరాజా? ఎప్పుడు రావడం? రా, కూర్చో," అని ఆహ్వానించి, ఆప్యాయంగా కుర్చీ చూపించి, పక్కకుర్చీలో

కూర్చోపెట్టుకున్నారు, జగన్నాథంగారు. పరస్పరం కుశలప్రశ్నలయిన తర్వాత, "అమ్మాయి బి. ఏ. ప్యాసయింది తెలుసా?" అన్నారు జగన్నాథంగారు మిత్రుడితో.

"ఓహెూ! ప్యాసైందీ? మంచిదే! అయితే ముందు సంగతేమిటి?" అన్నాడు కామరాజు.

"అదే తోచకుండా వున్నది. పైకి చదివిద్దామంటే, అమ్మాయికి క్లాసురాలేదు. మూడో క్లాసులో ప్యాసైనవాళ్లకు ఎం. ఏ. కి సీటు రాదని తెలియపర్చారు"

"అయితే, యింకా పిల్లను పైకి చదివిద్దామనే ఊపుమీదే వున్నావన్నమాట!"

"ఉండకేమి చెయ్యను?"

"నీకు మతిలేదురా, జగన్నాథం! ఇన్నాళ్లూ ఊళ్ళో చదువు, ఇంట్లో తిండిగనుక యింతదాకా లాక్కొచ్చావు. ఇప్పుడు ఎమ్మేలు, గిమ్మేలు చదవటానికి ఏ వైజాగో, మద్రాసో పంపిస్తే ఏమవుతుందో తెలుసా?"

"అందుకేగా ఆలోచిస్తున్నాను?"

"చాల్లే! ఇక నీ ఆలోచనలు కట్టిపెట్టు. నీకు వచ్చే నూట యాభైలోనూ సగం పిల్ల చదువుకింద పంపిస్తే, సంసారం యెలా గడుపుదామనుకుంటున్నావు?"

"అదే తోచకుండా వున్నదిరా."

"నీకు తోస్తే, ఆడపిల్లకింత చదువు చెప్పించనేచెప్పించవుగా!" అన్నాడు కామరాజు.

"నీమాట లెప్పుడూ ఇంతే!" అని తిన్నగా నవ్వారు జగన్నాథం గారు, కామరాజు స్వభావం తలచుకొని.

కామరాజు నిష్కర్ష మనిషి. తనకు తోచింది కుండ పగలకొట్టినట్లు ముఖాన అనేస్తాడు. కల్లకపటు మెరుగడు. కరకుగా వున్నా, అతని మాటల్లో నిజం తొణికిసలాడుతూ వుంటుంది. జగన్నాథం

మీద ఆయనకెంతో అభిమానం, ప్రేమ. తన మిత్రుడు మెప్పులకు పోయి సంసారాన్ని చిక్కుల్లో పడవేసుకోడం ఆయన కిష్టంలేదు.

"ఇదుగో జగన్నాథం! నేను చెబుతున్నాను విను. తలకు మించిన బరువులు తలపై వేసుకొని తలక్రిందులు కాబోకు! అసలు ఆడపిల్లలకు పెట్టేదంతా ప్రతిఫలరహిత మైంది. దానివల్ల కూడి వచ్చే దేమీ లేదు అందువల్ల వాళ్ళ చదువులకని, కానుకలకని విప రీతంగా ఖర్చు చేశామంటే మనకు చిక్కే. నేను కఠినంగా అంటున్నా నని అనుకోకు. ఈ రోజున అప్పు సొప్పులు చేసి దివాలా అయ్యా మంటే, ఆ రోజున మనకు పెట్టేవాళ్ళెవ్వరూ ఉండరు. అయినా నేను చెప్పడమెందుకు? పెద్దల్లుడు అన్ని పాఠాలూ నేర్పేఉన్నాడుగా! అమ్మాయికి ఎమ్మే చదవడానికి సీటురాలేదని బెంగపెట్టుకుంటున్నావు ఇప్పుడు బి.ఏ. ప్యాసైన ఆ అమ్మాయికి తగిన వరుణ్ణి తీసుకురా! చూద్దాం. మీ అమ్మాయే బి. ఏ. ప్యాసైంది గనుక, అంతకంటే తక్కువ వాడిని కాదు గదా, తనతో సమానంగా చదివిన వాడినైనా ఒప్పుకోదుగదా! ఆమెకంటె ఎక్కువవాడు, అంటే ఏ ఎమ్మేనో, ఎమ్మెస్సీనో, ఎం. బి. బి ఎస్ నో, బియ్యీనో, చదివినవాడై ఉండాలి. అంత వాడిని విచా రించబోతే, అతడు రివ్వున రాకెట్టులాగా అంతరిక్షాని కెగిరి కన్యా దాతల చూపుల కందకుండా విహారం చేస్తూవుంటాడు. అతని కోర్కె లకు అంతుండదు. అతనికి చక్కని పిల్లా కావాలి, బి. ఏ. ప్యాసైందీ కావాలి, నగలున్నదీ కావాలి, పది పదిహేను వేలు కట్నం తెచ్చేదీ కావాలి. వాళ్ళ అమ్మకు, అక్క చెల్లెళ్ళకు నాలుగు వేలు లాంఛనాలు వచ్చేదీ కావాలి. రిస్టువాచీ కావాలి, రేడియో కావాలి, కారుకావాలి. మేము మేమని ఎగబడివచ్చి యిచ్చేవాళ్లుంటే, అబ్బాయి కేమివద్దు? అన్నీ కావాలి. అందుకనే, ఆడపిల్లకు పెళ్ళిచేయడం ఎట్లాగూ తప్పదు. గనుక, పిల్లలకేదో సూక్ష్మంగా చదువుచెప్పించి పెండ్లిచేయకూడదా? ఈ చదువులకు కూడా యింతపోయడమెందుకంటాను నేను."

"నీవు చెప్పింది నిజమేగాని, యీ రోజుల్లో ఆడపిల్లలకందరూ లక్షణంగా చదువు చెప్పిస్తూంటే మన అమ్మాయిలకుకూడా చదువు

చెప్పించాలని వుంటుందికదా! అందులోనూ తెలివిగా, అందరిలోకీ ఫస్టుగా చదువుతూంటే, మనం చెప్పించకుండా ఎట్లా వుంటాం చెప్పు? చదివించి ఉంచితే, పెండ్లికానప్పుడు ఉద్యోగం చేసుకునైనా జీవిస్తారుగా!" అన్నారు జగన్నాధంగారు.

"ఏమిటీ? ఉద్యోగంచేసి జీవిస్తారా? నా మొహం! నీవింత అమాయకుడివేమిరా జగన్నాధం! పెండ్లికి పెండ్లే, ఉద్యోగానికి ఉద్యోగమే. ఒక దానివల్ల ఒకటితీరదు. ఉద్యోగం చేస్తూంటే మాత్రం పిల్లకు పెండ్లిచేయవలసిన బాధ్యత ఎట్లా తీరుతుంది? పెండ్లికాని పిల్లలు కాలేజీలో చదువుకోవడమే దుర్భరమైపోతున్నది. ఇంక మగవాళ్లతో కలిసి ఉద్యోగాలు చేయడమెంత కష్టమో ఆలోచించు. ఎక్కడైనా పెండ్లైన యువతులే కొంచెం సుఖంగా నెగ్గుకొస్తున్నారు గాని, కన్యలుగా వున్నవారిస్థితి ఎక్కడా కష్టంగానే వుంటున్నది. నన్నడిగితే, యీ తలిదండ్రుల కొకసలహా యిస్తాను," అన్నాడు కామరాజు.

"ఏమిటది?"

"ఈ పై చదువులు చదివించే భ్రాంతి వదులుకొని, దానికి పెట్టే ఖర్చు పెండ్లికే పెట్టి, కన్నెచెర వదిలించుకోడం మంచిదని."

"దానికి మాత్రం తగినవరుడు దొరకొద్దూ? చదువురాని పిల్లను ఎవరు చేసుకుంటారు?" అన్నారు జగన్నాధంగారు.

"ఏమో నబ్బా! నేను మా వాడి పెండ్లిచేశాను. పిల్ల ఏమి చదువుకున్నదని నేను అడగనేలేదు. మా వాడూ చదువుకున్నవాడైనా, చదువుకున్న పిల్లే కావాలని పేచీ పెట్టలేదు. పిల్లనుచూచాం. సరే అన్నాం. కట్నం, లాంఛనాలు మనం కోరకుండానే వాళ్ళు ఇచ్చారు. ఇచ్చినదేమో తెచ్చుకున్నాం. గుట్టుగా యింటికి వచ్చాం. ఈ మధ్య దొడ్డిగోడమీద బొగ్గుతో 9 అంకెవేసి వున్నది. ఎవరు వేశారని మా అమ్మాయినడిగితే, చాకలివాడికి గుడ్డలు లెక్కపెట్టి వడిన ఆ అంకె గోడమీద వేసిందన్నది. ఓహెూ, అంకెలు వచ్చునే, చదువు కూడా వచ్చును కాబోలనుకున్నాను.

"అసలు మగపిల్లవాడు గవుడి గేదెవంటివాడు. వాడికింద ఎంత ఖర్చుచేసినా అంతకంత లాభమే. పిల్లవాడికి చదువు చెప్పిస్తామనుకో, చక్కగా ఉద్యోగంచేసి చేతికి ఆసరాఅవుతాడు. వాడికి కట్నమిచ్చి పిల్లనిస్తారనుకో, అదీ మనయింటికి వచ్చేదే. కోడలికి నగలు పెడతామనుకో, అదీ మనయింటికొచ్చేదే. కోడలి కేదైనా ఆస్తిపాస్తులుంటాయనుకో, అవీ మనయింటికి వచ్చేవే. ఎటుచూచినా ప్రతిఫలం ముట్టచెప్పేవాడు కుమారుడు. ఇక ఆడపిల్లల విషయమా? అంతా ప్రతిఫల త్యాగమే! అంతా నిష్కామయోగమే! అమ్మాయికి చదువు చెప్పిస్తాం, అదీ ఖర్చే. పెండ్లి చేస్తాం, అదీ ఖర్చే. కట్నాలిస్తాం, అదీ ఖర్చే. ప్రెజెంటేషన్లు వస్తాయి, అవీ ఆమే తీసుకుపోతుంది. నగలు పెడతాం, అవీ ఆమె తీసుకుపోయేవే. సరే, ఉద్యోగం చేస్తుందనుకో. అదీ భర్తృసంసారానికే అర్పితం. మధ్యరకం సంసారాలవాళ్ళం యివన్నీ ఎక్కడ భరిస్తాం? అందుకే, మప్పితంగా చదువు చెప్పించి పెండ్లి చేయడం మంచిదని నా అభిప్రాయం," అన్నాడు కామరాజు

"నువ్వు చెప్పిందంతా వాస్తవమేరా! అయినా..." అని జగన్నాధంగారు ఏదో చెప్పబోతుండగానే, "అయినా గియినా అనే నానుడుమాటలు కట్టిపెట్టి, కమల పైచదువుమాట అట్లా వుంచి సంబంధం విచారించి త్వరగా పెండ్లిచెయ్యి!" అన్నాడు కామరాజు.

ఆ మాట వింటూనే, "నేనూ అదే మొత్తుకొంటున్నాను, అన్నగారూ! ఈయన వినకుండా వున్నారు" అంటూ జగన్నాధంగారి భార్య వచ్చింది.

"ఊఁ! అందరూ అదేమాట చెప్పతారు, అదేదో సులభమైన పని అన్నట్లు" అన్నారు జగన్నాధంగారు.

"నిజమే, ఒప్పుకుంటూ. పెండ్లిచేయడం సులభంకాదు. పొరుగూరికి పంపి పైచదువులు చదివించడం మాత్రం సులభమా?" అన్నాడు కామరాజు.

"చదువుకుంటే నెల నెలా ఏదో కొంచెంకొంచెంగా పంపుతాం. ఇదిఅట్లాకాదే! ఒక్క మాటే వేలు కుమ్మరించాలి. ఎక్కడ తీసుకురాను?" అన్నారు జగన్నాధంగారు.

"పిల్ల ఎమ్మే ప్యాసయితే పెండ్లి చేయనక్కర్లేదా? ఇదిగో జగన్నాథం, ఆలోచించావో లేదో! పిల్లకు హెచ్చుచదువు చెప్పించిన కొద్దీ వివాహ సమస్య మరింత క్లిష్టమైపోతుంది. 'చదువుకున్న పిల్లయితే నాకు కట్నమవసరంలేదు' అనే వరుడు దొరికేటట్లయితే, మనమెంతైనా చదువు చెప్పించవచ్చు. అటువంటి వరశేఖరుడు మచ్చుకు ఒక్కడైనా దొరకకపోతే, ఎందుకు చెప్పించిన చదువులు చెప్పు!" అన్నాడు కామరాజు

"మీ కడుపు చల్లగా, అట్లా నచ్చచెప్పండి అన్నయ్యా!" అన్నది జగన్నాథంగారి సతీమణి.

జగన్నాథంగారు ఏమీ మాట్లాడకుండా ఉండిపోయారు. "ఇక నేను వెళ్ళివస్తారా," అంటూ కామరాజు సంచీ, గొడుగు తీసుకొని బయలుదేరారు. "ఎక్కడికి వెళ్తావు? ఉండు. రేపు వెళ్దువుగాని," అన్నారు జగన్నాథంగారు. "లేదురా! నేను అవసరంగా వెళ్లాలి. ఈ వూరువస్తే నిన్నుచూడకుండా వెళ్లలేను. ఇంతకూ అమ్మాయి కమల ఎక్కడ? ఊళ్లో లేదా?"

"ఉన్నది. వాళ్ల స్నేహితురాలింటికి వెళ్లివస్తానని యిప్పుడే వెళ్లింది. కాస్సేపట్లో వస్తుంది. ఈ పూటవుంటే, అమ్మాయితో కూడా మాట్లాడవచ్చు."

"అం హా! యిప్పుడు వీలుకాదు. మళ్లీ కొద్దిరోజుల్లో వస్తాలే." అని కామరాజు వినకుండా వెళ్లిపోయాడు.

కామరాజు పిల్ల పెళ్ళి విషయమై చెప్పిన మాటలు జగన్నాథంగారి మనసులో పెద్ద సంక్షోభం రేకెత్తించాయి. నిజమే. ఎంత చదివించినా కమల వివాహం చేయక తప్పుతుందా? చేయాలి. ఈ కరువుకాలంలో సంసారం నడపలేక చింకి చెప్పులతో, చిరుగు పంచితో, అతుకుల చొక్కాతో కాలక్షేపం చేస్తున్న స్కూలు మాస్టర్ల జాతివాడు తాను. కమల వివాహం ఎట్లా చేయగలను అనుకున్నాడాయన. పెద్దపిల్ల పెళ్ళితోనే ఆయన తల బొప్పికట్టింది. ఆ అల్లుడు ఆయనను పెట్టిన కష్టాలు అన్నీ యిన్నీ కావు. ఆయన యింతవరకు

పెండ్లి మాట తలపెట్టకుండా కమలను చదివించడానికి అదీ ఒక కారణమే. జగన్నాథంగారికి నెలకు వచ్చే జీతం నూటయాభై. దీనితో కుటుంబపోషణ చేస్తాడా, పిల్లలకు చదువులే చెప్పిస్తాడా, పెళ్ళిళ్ళే చేస్తాడా ? పైగా ఆడసంతు ఎక్కువ. నలుగురు ఆడపిల్లలు, ఒక మగపిల్లవాడూనూ. ఆ పిల్లవాడు ఈ ఏడే ఎస్.ఎస్.ఎల్.సి.కి వచ్చాడు. వాడికి చదువు చెప్పించుకోవాలి పిత్రార్జితం మూడెకరాలుంటే, అందులో ఒక యకరం పెద్దపిల్ల పెండ్లికి ఖాళీ అయింది. మిగతా రెండెకరాలలోనూ తిండిగింజలు గిడుస్తున్నాయి. కమలపెండ్లి తలపెడతాడా, ఆ రెండకరాలూ తెగనమ్మాలి. తానా రిటైరయ్యే స్టేజికి వస్తున్నాడు. ఇక కమల పెండ్లికే రెండెకరాలూ అయిపోతే యింకా ఇద్దరు ఆడపిల్లల పెండ్లి, పిల్లవాని చదువూ ఎట్లా జరగాలి ? ఆలోచనల్లో ఆయన మనస్సు వ్యాకులితమయింది.

ఇంట్లో చదువుమాటలు వెనకపట్టి, పెండ్లిమాటలు ఎక్కువ కావడం కమల గమనించింది. చదువు పూర్తి అయిందిగదా, కమలకి పెండ్లి చేయరా – అని ప్రతివాళ్ళూ అడుగుతున్నారు. ఇక ఇంట్లో తల్లి పెట్టే పోరుకు అంతేలేదు. కాని కమలకు పెండ్లంటే విపరీతమైన భయం, ఏహ్యభావం ఏర్పడ్డది. ఇందుకు తన బావతో తన అక్క పడుతున్న అగచాట్లు ముఖ్యకారణం.

తన బావకు మిలిటరీ ఆఫీసులో పని. ఒకనాడు జబల్పూరులో వుంటాడు ; ఒకనాడు బెంగుళూరులో వుంటాడు ; ఒకనాడు బొంబాయిలో వుంటాడు ; ఒకనాడు ఢిల్లీలో వుంటాడు. అంతంత దూరాన వుండి, నాలుగుమైళ్ళ దూరంలో వున్నవాడిలాగా "మీ అమ్మాయిని వచ్చి తీసుకుపొండి, నేను కాశ్మీరు వెడుతున్నాను" అని ఒక ముక్క రాసి పారేస్తాడు. తక్షణం నాన్న వెళ్ళి తీసుకురావాలి. లేదా తమ యింటనే అక్క ఉన్నట్లయితే, "నేను ఫలానా తేదీని కలకత్తా వస్తున్నాను, మీ అమ్మాయిని తీసుకురండి" అని అర్జంటు టెలిగ్రాం కొడతాడు. తక్షణం దాన్ని తీసుకెళ్లి దిగపెట్టిరావాలి. ఒక్కొక్క ప్రయాణానికి నాన్న నెలజీతం చాలదు. ఊరికే వెళ్ళడంకాదు, అక్క

య్యకు కావలసిన చీరెలు, రవికెలు కొనివ్వాలి. బావగారి మెహర్బానీ కోసం ఆయన కేదైనా మంచి సూటుగుడ్డకూడా కొని తీసుకుపోవాలి. ఇంత పెట్టినా, "వట్టి దిక్కుమాలిన సంబంధం చేసుకున్నా" నని పొద్దస్తమానం బావ తిడతాడని అక్కయ్య ఏడుస్తుంది ఇ తేకదా పెండ్లిసుఖం! అయినా తండ్రి ఊరుకుంటారా? సంబంధాలు చూడ్డం ఆరంభించారు ఒకతను తనకంటే తక్కువ చదివాడు. ఒకతనికి చదువుకున్న పిల్ల అక్కర్లేదట. ఒకడికి అయిదువేలు కట్నం కావాలి. ఇతను కాలేజీ లెక్చరరు. చేసుకుంటే బాగానే వుంటుందేమో గాని, తన వివాహంతో తండ్రి జీవనాధారంగా వున్న రెండెకరాలూ అమ్మి వేయాలి. కమలకు యీ పరిస్థితి తలుచుకుంటే దుర్భరం అనిపించింది. పెద్దతనంతో తండ్రి తన జీవనాధారమైన పొలం అమ్మి తన వివాహం చేయడం ఆమె సహించలేకపోయింది "నాన్నా, నా పెండ్లికి యిప్పు డేం తొందరొచ్చింది? ఒకటి రెండు సంవత్సరాలు ఉద్యోగం చేస్తాను. తరవాత చూడొచ్చు" అని ధైర్యంచేసి తండ్రికి చెప్పింది. "అమ్మా! ఉద్యోగం ఎందుకమ్మా! ఎన్నాళ్ళు ఆగితేమాత్రం వివాహం చేసుకోక తప్పేదేముంది? వయసుమీరితే సంబంధాలు రావడం కష్టమే," అన్నారు తండ్రి. "నీవు ఉద్యోగం చేసి మమ్ము పోషించ నక్కర్లేదు, వివాహం చేసుకోమని పోరింది తల్లి.

కాని కమల వినలేదు. ఊరిలో ఆఫీసులన్నిటికీ దరఖాస్తులు పెట్టింది. ఆ వూరిలో ఏ కచేరీలోనూ ఉద్యోగిను లెవరూ లేరు. చాలా మంది ఆఫీసర్లు ఆ కారణంతో ఖాళీ లేదని వంకపెట్టి ఆమె దరఖాస్తు నిరాకరించారు. తుదకు ఒక ఎలక్ట్రిసిటీ ఆఫీసు అధికారి ఆమె దర ఖాస్తును ఆమోదించి, ఫస్టుతారీఖునవచ్చి జాయిన్ కమ్మన్నారు. ఆఫీ సరుగారి ఉత్తర్వు ప్రకారం ఛార్జీ పుచ్చుకోడానికి కమల ఆఫీసుకు వెళ్ళింది. ఆఫీసులో వున్న ఉద్యోగులు, జవానులు అంతా వింత మృగాన్ని చూచినట్లు ఆమెవంక చూడటం మొదలుపెట్టారు. ఆమె ఛార్జి తీసుకొని, తన ఆఫీసుగదిలోకి పోయి కూర్చోగానే, తోటి గుమాస్తాలంతా ముసి ముసి నవ్వులు మొదలు పెట్టారు. ఆఫీసరు లేకుండా చూచి ప్రక్క ప్రక్క గదుల్లో చేరి "ఏమిట్రా! మన

ఆఫీసరు అమ్మాయిమీద కన్నేశా డేమిరా !" అని ఒకడంటే "ఆమె బి. ఏ. ప్యాసైందిట్రా !" అని ఇంకొకడనేవాడు. "ప్యాసైన వాళ్ళు మగవాళ్ళలో లేర్రా ?" అని ఒకడు. "సంగీతమే కాదు, డ్యాన్సుకూడా వచ్చునట !" అని ఇంకొకడు. "సరే, యిక రేపటి నుంచీ ఆఫీసులో సంగీత కచ్చేరీలు, నృత్య ప్రదర్శనలు కాబోలు !" అని మరొకడు. చిత్తమొచ్చినట్లుగా ఆమెకు వినబడేలాగు మాట్లాడ్డం మొదలుపెట్టారు. ఆమె కూర్చున్న కాస్సేపూ జవాను అప్పలస్వామి, పని లేకుండానే ఆమెవంక మిర్రిమిర్రి చూస్తూ పచార్లుకొట్టడం మొదలు పెట్టాడు. అవసరం లేకుండానే, అక్కెండరు కాగితాలూ దారాలూ అందివ్వడానికి పదేపదే తయారైనాడు.

"మీకీ రూము కన్వీనియంటుగా వుందా ?" అని మేనేజరు వచ్చి అడిగి మరీ వెళ్ళాడు. ఆఫీసువాళ్ళ వాలకం, మాటలూ చూస్తే కమలకు సర్వాసహ్యం వేసింది. "యువకులతో కలిసిమెలిసి చదువు కోడానికీ, ఉద్యోగం చేయడానికి విదేశాల్లో యువతులకే చెల్లింది. ఏమిటి వీళ్ళ ప్రవర్తన ? ఇంత అసహ్యంగా ప్రవర్తిస్తారేమి అబ్బా ! వీళ్ళతో ఉద్యోగంచేయడం ఎట్లా స్వామీ ?" అనుకున్నది. ఆఫీసు గంట కొట్టగానే, తక్షణం లేచి యింటికి వెళ్ళడానికి ఆఫీసు ఆవరణ దాటి గేటువద్దకు వచ్చింది. వచ్చీ రావడంతోనే, "మన జగన్నాధం మాస్టరుగారి అమ్మాయి యీ ఆఫీసులో క్లార్కుగా చేరిందిరా !" "అవున్రోయ్, యీ అమ్మాయి హైస్కూల్లో చదివేరోజుల్లో హైస్కూలు వార్షికోత్సవ నాటకాల్లో వేషాలు వేసిందిరా ! ఇక్కడేమి వేషాలు వేస్తుందో !" అని కొందరు కుర్రాళ్ళు గేలిచేస్తూ నవ్వడం మొదలు పెట్టారు. ఆ దుర్భర దుస్సహ అవమానానికి లోలోన కుములుతూ కమల తలవంచుకుని యింటికి వచ్చివేసింది.



# 2. ఉద్యోగంలో

డాక్టరు శ్రీదేవి

"పోస్టుమెన్" అనే కేక విని, సగం జడ అల్లుకుంటున్న కమల వీధిలోకి పరుగెత్తింది. తను వెళ్ళేసరికే నాన్న చేతిలో ఒక కవరు పెట్టి వెళ్ళిపోయాడు పోస్టుమెన్. "ఎక్కడనుంచి?" అని నాన్న నడగకుండానే లోపలికి వచ్చేసింది, కమల. నాన్నకువచ్చే ఉత్తరాలు ఎక్కడినుంచి వస్తాయి? అక్క రాస్తుంది. అప్పుడప్పుడు ఏ మామయ్యో రాస్తారు. అందులో తను తెలుసుకోదగ్గ విశేషాలేవీ ఉండవు.

రోజూ పోస్టుమెన్ కేకవిని వీధిలోకి పరుగెడుతుంది కమల. రోజూ వట్టిచేతులతో లోపలికి వెళుతుంది. ఈ మధ్య దినపత్రికల్లో "గ్రాడ్యుయేటు కావాలి" అని ప్రకటించిన ప్రతిఉద్యోగానికీ దరఖాస్తు పెడుతోంది తను. అదీ యెవ్వరూ చూడకుండా. ఏ శుభముహూర్తాన్నైనా తన కోరిక ఫలిస్తుందేమోనని యీ నిరీక్షణ.

కమలకి ఉన్నవూళ్ళో ఉద్యోగం దొరికింది. అమ్మా నాన్న దగ్గర వుంటూ పుట్టి పెరిగిన వూళ్ళోనే బి. ఏ. దాకా చదువుకొని తాను

ఒక ప్రయోజకురాలి ననిపించుకోవడం ఎంత గర్వకారణం అనుకుంది ఒకప్పుడు. రెండు నెలల క్రిందట ఎలక్ట్రిసిటీ డిపార్టుమెంటులో ఉద్యోగం కోసం తనెంత ఆరాటపడింది! ఆర్డరు చేతికిచ్చిననాడు, మొదటి రోజున డ్యూటీకి వెళ్ళిన నాడు తన మనసులో ఎంత ఆనంద సందోహం! రెండు నెలలు తిరిగే సరికి ఆ ఉత్సాహం, ఆ గర్వం ఎక్కడి కక్కడ పటా పంచలయి పోయాయి. రెండో నెల జీతం పుచ్చుకున్న మూడో నాటి నుండి కమల తన జీవితాన్ని కొత్త మలుపులకు తిప్పాలని ప్రయత్నిస్తూంది. ఆమెకి యీ ఉద్యోగం, యీ ఊరు, యీ వాతావరణం నచ్చడం లేదు. పసిడి రెక్కలు పరుచుకున్న పక్షిలా మరొక కొత్త జీవితంలోకి ఎగిరిపోవాలని తహతహ. అందుకే మరొక ఊళ్ళో, వీలైతే ఏదైనా పట్టణంలో ఉద్యోగం దొరుకుతుందేమో నని పునః ప్రయత్నం.

కాలేజీలో చదువుకున్నన్నాళ్ళూ వయస్సు ఎదుగుతున్నా, కమలకు జీవితం గురించి పెద్ద ఆలోచనలేమీ లేవు. అప్పుడు తన ఏకైక లక్ష్యం పరీక్ష ప్యాసవటం. ప్యాసయాక ఏం చెయ్యాలి అనే సమస్యతో కొన్నాళ్ళు నలిగింది. చివరకు ఒక నిశ్చయానికి రాగల్గింది. పెళ్లి చేసుకుని నాన్నను అప్పులపాలు చేయకూడదు. తాను పరాధీన కాకూడదు. చదువును సద్వినియోగంచేసి తన కాళ్ల మీద తను నిలబడాలి. నాన్నకు తనొక ఆసరాగా నిల్చోవాలి. ఈ ధర్మాన్ని నిర్వర్తిస్తూ, తన నర్థంచేసుకుని తనను గౌరవించే వ్యక్తి తారసపడితే, అతనిని తన జీవిత భాగస్వామిగా గుర్తిస్తుంది.

"అమ్మాయ్!" ఆఫీసుకు టయిమయిపోతోందని తొందరగా వీధిలోకి జారుకుంటున్న కమలను వెనక్కి పిల్చారు జగన్నాథంగారు.

"ఏం నాన్నా?" అంది కమల, వీధి వసారాలోకి నాలుగడుగులు వేసి.

"ఏంలేదు! నీ దగ్గర ఒక్క పన్నెండు రూపాయిలుంటే ఇయ్య. కిష్టిగాడికి స్కూలు జీతం కట్టాలి. కూరలమనిషికి ఐదురూపాయిలివ్వాలంది మీ అమ్మ. దానికి కొంతైనా యివ్వాలి."

ఒక క్షణకాలం ఏదో చూసి, చేతిలోవున్న బేగ్ తీసి, పది రూపాయలూ నాన్న చేతిలో పెట్టి, వీధిలోకి గబగబా అడుగులు వేసింది కమల.

రోడ్డుమీద అడుగులు వేస్తూందేగాని, కమలమనస్సు ఎక్కడో పరిభ్రమిస్తోంది. ఆమె లేతవయస్సులో ఏవేవో కొత్త అనుభూతులు. అలవాటు లేని ఆవేదన తనకు జ్ఞానంవచ్చిన నాటినుండి ఆమె బాధ పడీనదీ, బెంగపడినదీ రెండు ఘట్టాలు. బి. ఏ. పరీక్షలు రెండు నెల లున్నాయనగా టైఫాయిడువచ్చి రెండునెలలు మంచాన పడటం, బి. ఏ. లో క్లాసు రాకపోవడమూను అయితేనేం! ఉద్యోగం దొరికిం దని ఎగిరి గంతేసింది ఆనాడు. మొదటిజీతం అందుకున్న నాడు మహోత్సాహంతో యింటికి వచ్చింది కమల. ఆ ఆఫీసు మనుష్యులు తనకు నచ్చలేదు. కాని ఎలాగో కళ్లుమూసుకుని నెల్లాళ్లు పనిచేస్తే చేతిలోకి జీతం వస్తుంది. స్వయంగా సంపాదించుకోవడంలో ఎంత ఆనందం వుంది అనుకుంది.

నాన్న ఇంటికి రాగానే "ఇవాళ జీతాలిచ్చారు నాన్నా!" అంది ఉత్సాహం ఉరికివచ్చేకంఠంతో. అలా అన్నప్పుడు నాన్న ఏమంటారో తను ముందే ఊహించుకుంది. "మంచిది తల్లీ! అంతకంటే కావలసిం దేముందీ? నీకు కావలసిన వేమిటో చూసుకుని కొనుక్కో. బట్టలు చాలవేమో, నాలుగుచీరలు కొనుక్కో. గొడుగు చిరిగిపోయిందికదూ! వచ్చేది ఎండాకాలం ఒక గొడుగు కొనుక్కో!" ఇలాంటివే ఏవేవో ఊహించుకుంది. తనకు నిజంగానే బట్టలకు చాలా ఇబ్బందిగా వుంది. నలుగురిలోనూ మసలవలసిరావడంవలన, శుభ్రమైన చీరలు మరొక రెండైనా కొనుక్కోవా లనుకుంది. అన్నిటికంటె ముందు అమ్మకి, నాన్నకి ఒక్కొక్క జత బట్టలు కొనాలి. తలిదండ్రుల పట్ల తనకుగల భక్తిభావానికి మొదటి నెల జీతంలో కొంత కేటాయించుకుంది కమల. కిష్టిగాడికి ఒక పెన్ను కొందామనుకుంది. చెల్లెళ్లిద్దరికీ నాలుగురిబ్బన్లు కొన్నా చాలు, మురిసిపోతారు.

ఈ బంగరు ఊహాలతను తృటిలో తెంచేసేరు జగన్నాథం గారు. "జీతం యిచ్చేశారా అమ్మా? జాగ్రత్తగా తెచ్చేవా? జీతా

లందుకునేటప్పుడు చాలా జాగ్రత్తసుమా! ఆఫీసులోనూ తోవలోనూ కూడా ఎన్నయినా గమ్మత్తులు జరుగుతూ వుంటాయి. ఆ హాండ్ బేగ్ భద్రం!" అంటూనే, "చూడు, నీ పరీక్షలకోసం సత్యనారాయణదగ్గర మీ అమ్మ గొలుసు తాకట్టుపెట్టేనుకదూ! అది విడిపించేద్దాం. ఆలస్య మైనకొద్దీ వస్తువు మనకి దక్కదు," అన్నారు. కమల ఉత్సాహ మంతా పాలపొంగులా అణగిపోయింది.

గొలుసు విడిపించడం, అమ్మమెళ్లో అది మెరుస్తూండడం అమ్మకీ నాన్నకీ తృప్తినిచ్చింది. కాని కమలకు చీరలు కొనుక్కునే తాహతు ఆ నెలలో కాదుకదా, ఆ తర్వాత నెలలో కూడా లేదు. రెండో నెల జీతం అందుకునేసరికి నాన్నకి మరొక పెద్ద ఖర్చు వచ్చింది. ఎప్పుడో సుబ్రహ్మణ్యంగారిదగ్గర అప్పుచేశారట. ఆయనకి బదిలీ అయిపోయింది గనక అర్జంటుగా అప్పుతీర్చి వేయాలన్నారు. అది కాక, ఉండీ ఉడిగీ అయిదూ పదీ ఇవాళలాగే అడిగపుచ్చుకున్నారు. జీతం అంది పదిహేనురోజులైనా కాలేదు. కమలదగ్గర యిప్పుడు రెండు రూపాయలు మాత్రం మిగిలాయి.

నాన్న సాధక బాధకాలు తానెరగక పోలేదు. ఆయన బరువునుకొంత తీర్చాలనే తన ప్రయత్నమూను. కానికమలకు అర్థం కాని విషయమొకటే. నిన్న మొన్నటిదాకా," "వర్షం వస్తుందేమో రిక్షా చేయించుకో. ఎండలుమండిపోతున్నాయి. మాధ్యాహ్నం వచ్చేటప్పుడు రిక్షాలోనే రా," అని చేతిలో డబ్బులు పెట్టేనాన్న ఇవాళ తన సంపాదనలో తనకు చేతిఖర్చుకైనా మిగలనీయరేం? పూర్వంలా, నాకు బట్టలు కావాలి, అది కావాలి, యిది కావాలి అని తా నిప్పు డెవరినీ అడగలేదు. పోనీ అమ్మకైనా తన అవసరాలు బోధపడతాయా అంటే, ఆవిడ ఇరవయ్యో శతాబ్దపు మనిషే కాదు. పిల్లలకు వంటచేసిపెట్టడం, పండగకు పిండివంటలు చేయడం, అత్తవారింట కూతురు కష్టాలు పడుతోందని ఏడవడం, వట్టి కిరాతకుడికిచ్చి నా కూతురు గొంతుకోశారంటూ, హిస్టీరియాపేషెంటులా ఉండుండి భర్తమీద విరుచుకుపడటం తప్ప పార్వతమ్మకు మరొకగొడవ లేదు. కమల ఎందుకు బి. ఏ. చదివిందో ఆవిడకి అనవసరం. కూతురు ఉద్యోగం చేస్తూంది కదా అని

ఆమెకు గర్వంలేదు. పైగా అనేక చిన్నతనంగా భావించి నిట్టూరుస్తుంది. యాంత్రికంగా సాగిపోయేసంసారంలో ఆవిడ ఒక మరచక్రం మాత్రమే. ఆవిడ నడకకి దోహదమిచ్చే రెండో చక్రం భర్త కనుక, ఆవిడ దెబ్బ లాడినా కీచులాడినా అంతా ఆ భర్తతోనే.

ఇక జగన్నాథం గారికి ఆరాటమే లేదు. ఏ క్షణాన్నయినా కమలకు సంబంధం దొరక వచ్చు. చేతి ఖర్చు పెట్టుకొని ఎలాగూ పెండ్లి చేయక తప్పదు. ఆ మూడుముళ్ళు పడ్డాక తన కేమీా కలిసి రాదు. ఇప్పుడు కూతురు కూడా నాలుగు డబ్బులు సంపాదిస్తూంది కనుక, ఇప్పుడే జాగ్రత్త పడి పాత బకాయిలు కొంత వరకైనా తీర్చే యాలి. అందుకే ఆయన ఒక్క నయాపైసా వ్యర్థం కానీయకుండా కూతురును స్వప్రయోజనానికి ఉపయోగించు కుంటున్నారు.

పరాకుతో, చిరాకుతో అడుగులు ఉదాసీనంగా వేస్తూ ఆఫీసుకి అరగంట లేటుగా చేరింది కమల. ఆఫీసరు యింకో అరగంటకిగాని రాలేదు. అయినా, హెడ్ గుమాస్తా చివాట్లు పెడతాడేమోనని భయ పడింది. అతనలాంటి పనేమీా చేయలేదు. పైగా 'ఇంటిదగ్గర్నుంచి యింతదూరం నడిచివచ్చేవటమ్మా!' అని పలకరించి ఊరుకున్నాడు. చేయాల్సిన పని చాలా వుంది తనముందు బోలెడు కాగితాలు పడి వున్నాయి.

హెడ్ గుమాస్తా ఆఫీసరు గదిలోకి వెళ్లడంచూసి, పక్క గుమాస్తా విఠల్ రావు తన దాకా పనికట్టుకొనివచ్చి, "ఏమండోయ్ కమలమ్మగారూ! మీారుగనక యింత ఆలస్యంగా వచ్చినా హెడ్ గుమాస్తా అంత స్వీట్ గా పలకరించి వూరుకున్నాడు. అదే మేము యితేనా? ఉరుములూ పిడుగులూ వర్షిస్తాయి. అయినా, ఆడవాళ్ల పని హాయిలెండి! అందరూ దయతలుస్తారు వాళ్లని," అంటూ చక్కా పోయాడు.

అసలే వికలంగావున్న కమలకి విఠల్ రావు మాటలు మరింత విచారం కలుగజేశాయి. హెడ్గుమాస్తా తన నెందుకు చివాట్లు పెట్టలేదు? అందరినీ దెబ్బలాడినట్లే, నలుగురికీ వినబడేలా తనమీాద కూడా కేకలేస్తేనే కమలకు హాయిగా వుండేది. అబలకదా అని తన

మీద ఎవరూ సానుభూతి చూపించటం కమల సహించలేదు. చిన్న క్లాసులు చదివే రోజుల్లో, "ఆడపిల్ల గనక మార్కు లెక్కువ వేశార్రా మాష్టరూ!" అని తోడి మగపిల్ల లంటూంటే, తను ఏడ్చేసేది. ఇవాళ ఈ ఆఫీసులో ఎమ్మేలూ, బియ్యేలూకూడా ఆ పిల్లల మనస్తత్వంతోటే ప్రవర్తిస్తున్నా రనిపించింది కమలకి. "ఛీ ఛీ, వీళ్ళవరికీ సంస్కారం లేదు ఆడవంటే ఇంత ఎగతాళి ఎందుకు?" అనుకుంది.

అసలు విఠల్‌రావు ఎప్పుడూ యింతే. రోజూ కల్పించుకుని ఏదో మాట విసురుతాడు. తాను జవాబు చెప్పదు. అతని వంక ఎర్రగా చూచి ఊరుకుంటుంది. అంత మాత్రానికే జడిసే రకం కాదతను.

ఇవాళ మాత్రం కమల మామూలుగా లేదు, విఠల్‌రావు కలిగించిన చిరాకుతో. హెడ్ గుమస్తా దగ్గరకు తన ఫైలు తీసుకుని విస విసా నడిచింది. "ఈ దస్తూరి నాకేమీ బోధపడ్డం లేదండీ బోధపడని కాగితాలన్నీ నా ముందర పడేయిస్తా రెందుకు? టైపు చేయించయినా పంపించండి," అంది అతి విసురుగా. హెడ్ గుమస్తా అదోలా మొహంపెట్టి, ఏమిటీ ఈ అమ్మాయి వాలకం అన్నట్టు చూస్తూ "చూడమ్మాయి టైపిస్టు సెలవు పెట్టాడని తెలీదూ? అయినా, యిక్కడ అందరిలో నువ్వు జూనియరువి. పైగా టెంపరరీ పోస్టు. ఏ రోజుకు ఆ పని మిగిలిపోతే అది నీ కిస్తాం. ఇచ్చిన ప్రతి పని సవ్యంగా చేస్తేనే నాలుగు కాలాలపాటు యిక్కడ ఉండగలవు. అంతే కాని, 'నాకిలాంటి కాగితాలు పంపకండీ, అవి డ్రాఫ్టు చేయడం నాకు చేతకాదు, ఇది ఎలా వ్రాయాలో నాకు తెలియదు, అనే దానివి ఉద్యోగం మానేసి హాయిగా పెళ్ళి చేసుకో', అని ఒక ఉపన్యాసం యిచ్చాడు. "ఈ ఆడవాళ్ళతో యిదే బాధ. గట్టిగా చెపితే ఏడుస్తారు; ఊరుకుంటే మురిపించేస్తారు" అన్నాడు. కమలకు తల తీసేసినట్టయింది. దానికి తోడు, హెడ్ గుమస్తా మాటలు వింటూనే విఠల్‌రావు కిసుక్కున నవ్వేడు. హెడ్ గుమస్తా కూడా తన స్త్రీత్వాన్నే ఎత్తిపొడిచాడు.

కమలకి కావలసింది మనిషి మనిషితో మాట్లాడినట్టు మాట్లాడ్డం— అంతేకాని, మగవాడు ఆడదానితో మాట్లాడినట్టు కాదు. కాని, ఆ ఆఫీసులో ఒక్కరూ కమలకి కావలసినట్టు మాట్లాడరు.

సాయంత్రం యింటికి వస్తూ కమల అనుకుంది. ఈ ఆఫీసులో వాళ్ళకి ఆడది ఉద్యోగం చెయ్యటం సర్కస్‌జంతువు ఫీట్స్ చేసినట్లుగా వున్నట్లుంది. వీళ్ళదింత సంకుచిత ప్రపంచమేమో! కళ్ళువిప్పి, మారి పోతూన్న ప్రపంచాన్ని చూడరేం? ఈ చిన్న వూళ్లో మనుష్యు లింతేనేమో! అదే ఏ సిటీలోనో అయితే, ఎవరిపనులు వారివి. ఎంత మంది స్త్రీలు ఉద్యోగాలు చేయడంలేదు పట్టణాల్లో! వాళ్ళందరూ యిలాంటి మనుష్యుల మధ్యనే ఉంటున్నారా?

* * *

అనుకోకుండా ఇందిర కనిపించింది. తన క్లాసుమేటు సరోజిని పెళ్ళంటే, ఆ రాత్రి చూడ్డానికి వచ్చింది కమల. ఇందిరకూడా ఇంటరు వరకూ తనకు క్లాసుమేటు. అప్పట్లో చాల స్నేహంగా ఉండేది. సరో జిని అత్తవారు ఇందిరభర్తకు చుట్టాలు. పెళ్ళిపందిరిలో కూర్చున్నంత సేపూ ఇందిర కమలపక్కనే కూర్చుంది. ఒడిలో పదినెలల పసివాడు. ఇందిర చాలా హుషారుగా కబుర్లు చెప్పింది. అవతల మగవాళ్ళలో కూర్చున్న భర్తను చూపించింది. ఇంజనీరుట. ఇందిర అంత అందకత్తె కాకపోయినా, మంచి భర్తను సంపాదించిందే అనుకుంది కమల మనస్సులో. ఇందిర చెప్పింది, వాళ్ళాయనకు కట్నాలంటే అసహ్యంట. సరోజిని పెళ్ళికికూడా కట్నంలేకుండా ఒప్పించింది వాళ్ళ ఆయనేనట. ఇందిర తన సంసారాన్ని గురించి చాలా చెప్పింది. ఆమె చెప్పేదాంట్లో చీకూచింతా లేని సుఖజీవితం కనిపించింది కమలకు. మాటల మధ్యలో "ఏమిటీ నీ ఉద్యోగం నువ్వానూ? పెళ్ళి చేసుకోవా ఏమిటి?" అని సంసారంలో వున్న సుఖం ఉద్యోగంలో లేదు సుమా అన్నట్లు చప్ప రించింది.

చదువుకునే రోజుల్లో ఇందిర బక్కగా, ఎప్పుడూ దిగులుగా వుండేది. ఇప్పుడు మనిషి బాగుంది. వంటికి నిండైన నగలు. అంత కంటె నిండుతనమిచ్చే ఆనందం, తృప్తి తొణికిసలాడే వర్చస్సు. ఎవరైనా చూచి అసూయపడే లాంటి కొడుకు. ఇందిరను చూస్తూ

కాస్సేపు తననూ తన పరిసరాలనూ మరచిపోయి, "యింతకంటె స్త్రీకి ఇంకేం కావాలి? ఇందిర అదృష్టవంతురాలు!" అనుకుంది కమల.

కమల పెళ్ళివారింటి నుండి ఇంటికి వచ్చేసరికి రాత్రి తొమ్మిది దాటింది. నాన్న ఇంకా మేల్కొనే వున్నారు. సాధారణంగా ఆయన తొమ్మిదయ్యేసరికి నిద్రపోతారు. చలి వొణికిం చేస్తూంది. వంటింట్లో అమ్మ కుంపటి ముందర పెట్టుకొని కూర్చొంది. అందరి భోజనాలూ అయినట్లున్నాయి.

కమల భోజనానికి కూర్చున్నాక నాన్న వంటింట్లోకి వచ్చి, "అమ్మాయ్! అక్కయ్య ఉత్తరం రాసింది" అన్నారు. కమల ఎక్కువ ఆసక్తి చూపకుండానే, "అంతా బాగున్నారా?" అన్నది. "ఆ బాగానే వున్నారు. ఈమారు పండగకి అందరూ వస్తున్నారట. అక్కయ్య మళ్ళీ నెల తప్పిందట ఈమారు పురిటికి ఇక్కడే ఉండిపోతానంటూంది. ఆయనగారికి ఈమారైనా హెూదాకు తగిన బట్టలు పెట్టాలట. తనకు చీర కొనకపోయినా ఫర్వాలేదన్నది. కాని అల్లుడికి మాత్రం కోపం తెప్పించవద్దని గోలపెడుతూ రాసింది," అన్నారు జగన్నాధంగారు. అంతవరకూ మౌనంగా ఉన్న అమ్మకూడా "బాగుందండీ! అదలా అంటే మాత్రం మనం ఊరుకోగలమండీ? పండగపూటా ఆడపిల్ల పుట్టింటికి వస్తే చీర కొనకపోతే ఎలాగ? పట్టుచీర ఎలాగా కొనలేం. ఒకచుట్టు జరీచీరైనా కొనండి" అంది.

కమలకు కళ్లుతిరిగినట్లయింది. నాన్న ఎందుకీ వార్త పనిగట్టుకుని చెప్పారో తానూహించగలదు: ఎల్లుండి ఫస్టుతారీకు.

కమలకింక అన్నం సహించలేదు. తినాలని లేదంటూ, కంచంలో నీళ్లుపోసి గదిలోకివెళ్ళి దుప్పటి ముసుగుపెట్టుకుని పడుకుంది. అర్ధరాత్రి గడచినా కమలకు నిద్రపట్టలేదు. నిన్నె మొన్నటివరకూ నాన్న యీ సంసారాన్ని ఎలా యీదుకు వచ్చారు? ఇవాళ ఆయనకు వచ్చే అవాంతరపు ఖర్చులన్నింటినీ తనమీదే రుద్దేస్తున్నా రెందుకు? తనకూ కొన్నిఖర్చులు, తనకూ కొన్నిసరదాలు ఉండవా? అలా అనుకునేసరికి నాన్నకు ఆసరాగా నిలవాలి, తన సంపాదనతో ఆయన బరువును తీర్చాలి అనుకున్న కమల హృదయం ఆమెనే తిరిగి ప్రశ్నించింది:

"మీ నాన్న ఎన్నెన్ని బాధలుపడి ఎంత ఖర్చుచేసి నిన్నింత దానిని చేశాడో మరచిపోయావా? ఇవాళ ఆయనకోసం నీ ఆర్జనని ఖర్చు చేయడానికింత వెనకాడుతావేం?" కమల ఆలోచిస్తూంది. నిజంగా తను స్వార్థం పెంచుకుంటూందా? ఇదంతానాది, వీళ్ళందరూ ఎవరు నన్ను పీక్కుతినడానికి - అనుకుంటూందా? అయితే నాన్నకోసం తనలో చిగురిస్తూన్న కొత్త అభిలాషలను చంపుకోవలసిందేనా? అదే తన ధర్మమా? నిజమే. తండ్రికోసం అడవులకుపోయిన శ్రీరామ చంద్రుడు ఆదర్శవ్యక్తి. ఆదర్శాలకోసం వ్యక్తిత్వాన్ని పూర్తిగా చంపుకోవాలా? తన అవసరాలన్నిటినీ అణగదొక్కేసుకోవాలా? కమల మేల్కొన్న హృదయంలో ప్రబలమైన సంఘర్షణ జరుగుతోంది.

ఇందిరని చూసి వైవాహిక జీవితమే సుఖవంతం అనుకోవాలా? తన అక్కను చూసి అసహ్యించుకోవాలా? "మా ఆయనకు కోపం తెప్పించకండి. ఆయన ఏదడిగితే అది ఇచ్చేయండి" అంటూ ఉత్తరాలు రాసే అక్కను చూసినకొద్దీ కమలకు తోబుట్టువు యెడల సహజంగా ఉండవలసిన అభిమానం కూడా నశిస్తోంది. తన కో వ్యక్తిత్వమంటూ లేకుండా, భర్తగారి కెక్కడ కోపం వస్తుందోనని హడలిపోయే అక్క, స్త్రీ అనే సరికి అలుసుగా చూసే ఆఫీసులో మనుష్యులు, ఆడపిల్లయినా సంపాదిస్తూందనే తృప్తి లేకుండా స్వార్థం ముసుగులో తన బాగోగులను పట్టించుకోని తల్లిదండ్రులు-యిదంతా అయోమయంగా వుంది కమలకు. కనుచూపుమేరలో వెలుతురే కనపడ్డంలేదు.

ఇందిర అనుభవించేలాంటి సుఖజీవనం లేకపోయినా ఫరవా లేదు. స్వేచ్ఛ, వ్యక్తిత్వం లేని చీకటి బతుకులో తానుకూడా మునిగి పోకూడదు అనుకుంది కమల. ఎంత పెద్ద రాత్రయినా, తెల్లవారక తప్పదు. సమస్యలు రేపిన ఆలోచనల పొదం అడుగున అలసిపోయి, కమల నిద్రపోయింది.

"ఆఫీసుకు టైమయి పోతూందే అక్కా!" అన్న చిన్నచెల్లెలి మాటలు పొద్దెక్కాక కమలను మేల్కొలిపాయి.

★

# 3. సంఘర్షణ

శ్రీమతి మాలతి చందూర్

శీతకాలపు గాలి చల్లగా, బద్ధకంగా వీస్తోంది. కమల ఆఫీసు నుండి యింటికి వచ్చింది. హాండ్‌బాగ్‌లో జీతం కమలని పరిపరి విధాల ఊరిస్తోంది. ఈ డబ్బుతో తను రెండు చీరలు కొనుక్కుంటే, తనూ తన ఫ్రెండ్సూ సినిమాకి వెళ్తే, వారం రోజులక్రితం షోకేసులో చూసిన కొత్తరకం స్లిప్పర్స్ కొనుక్కుంటే, నాన్న ఊరుకుంటారా? పైకి కఠినంగా కోప్పడరుగాని, సన్నగా మందలిస్తారు. ఈ సంపాదన రాగానే తనలో ఎందుకీ ఆలోచనలు కలుగుతున్నాయి? స్వతంత్రంగా ఏదో ఓ పని చెయ్యాలని ఎందుకిలా అనిపిస్తోంది?

ఆ రాత్రి నాన్న మరునాడు రాబోయే అక్కబావల్ని గురించీ, వాళ్ళ పిల్లల్ని గురించీ ప్రస్తావించారు. ఓ పది రూపాయలుమట్టుకు మిగిల్చి, మిగతాడబ్బు లెక్క గట్టి పుచ్చుకున్నారు. కమలకి ఏదో కసిగా, కోపంగా వుంది. ముఖ్యంగా తండ్రిమీదా, ఆ రాబోయే అక్కబావలమీదాను.

"ఈ నెల జీతంతో మనింట్లో అందరికీ పండగకి బట్టలు తెద్దా మనుకుంటున్నారా ?" అంది, తండ్రి డబ్బు విషయం ఎత్తగానే కమల బెరుగ్గా.

"అదెలాగమ్మా ? మీ బావకి మంచి సూటు కుట్టించకపోతే అతనికి కోపం వస్తుంది. ఈ డబ్బు అతని సూటుకి విడిగా వుండాలి," అన్నారు నాన్న అమ్మ అవునన్నట్లు తల ఊపి, "అమ్మాయికి చీర తేవాలి. అందులోనూ ఉత్తపిల్లకూడా కాదు," అంది తన ధోరణిలో.

"మరి కిష్టిగాడికీ, చెల్లాయిలకీ కొత్త బట్టలు లేకపోతే ఏడవరే అమ్మా ?" అంది కమల, తనకి కావాలని అడగలేక పిల్లలమీద పెడుతూ.

"మన పెద్దవాళ్ళ మాట ఎలావున్నా, మీ అక్కకీ, పిల్లలకీ కొట్లో పద్దురాసి తెస్తానమ్మా ! ఈ పండుక్కి అతనికి కోపం రాకుండా నెట్టుకువచ్చామా, బ్రతికి బయటపడ్డట్లే. లేకపోతే అమ్మాయిని పురిటికి ఉంచరు" అన్నారు నాన్న.

కమలకి నెత్తిన పిడుగుపడ్డట్లయింది. అక్కా, దాని యిద్దరు పిల్లలూ వీళ్ళంతా దాని పురుడు వెళ్ళేదాకా ఇక్కడే నన్నమాట. నాన్నా, అమ్మా కలిసి తనను గానుగెద్దే కాదు, పెద్దవాన్ని కూడా చేసేశారు. ఈ పండక్కి తనకి కొత్త చీరకూడా లేదన్నమాట. ఆరు నెలలయి ఉద్యోగంలో చేరింది తను. ఓ చీరగాని, ఆఖరికి ఓ చెప్పుల జతగాని కొనుక్కోలేకపోయింది రిజల్ట్సు వచ్చినప్పటినుంచీ తన ఫ్రెండ్సు అడుగుతున్న టీపార్టీకూడా ఇవ్వలేకపోయింది. దేనికోసం యీ సంపాదన ? ఉదయం తొమ్మిదిన్నర కెళ్ళి సాయంత్రం ఐదున్నర దాకా తను ఏ లక్ష్యం కోసం పనిచేస్తోంది ?

ఆ రాత్రి అంతు లేని ఆలోచనల్లో మునిగి పోయింది కమల. కొంచెంసేపు తల్లి తండ్రుల మీద, రాబోయే అక్క బావల మీద కోపం, అసహ్యం కలిగాయి. మరు క్షణంలో తన మీద తనకే కోపం కలిగింది. ఓ కొత్త చీర గురించి, ఓ సినిమా గురించి తన మనసెందు కింత ఆరాటపడుతోంది ? తన వాళ్ళ కోసం యీ చిన్న కోర్కెలు

మానుకో లేదా ? మానుకోగలదు. తన కాపాటి ఆత్మ నిగ్రహం వుంది. తన తండ్రి డబ్బు అడగకుండా ఊరుకొని ఉంటే, తనంతట తనే బావ గారికీ, పిల్లలకి ఏ కొట్లోనో తండ్రి చేత పద్దురాయించి తెప్పించి వుండేది బట్టలు. తన తండ్రి తనకా అవకాశం, ఖర్చు పెట్టే అనడం రెండూ కలగనివ్వలేదు. అక్క ఒక విధంగా బావగారికి బానిస అయితే, తను ఈ యింటికి బానిస.

భళ్ళున తెల్లవారింది. వీధిలో గుర్రబ్బండి ఆగిన చప్పుడుతో కమల బలవంతంగా కళ్ళు తెరిచి చూసింది. అక్కా, బావా, పిల్లలూ బండిదిగారు.

*　　*　　*

ఒకరకం వురుషులకి చదువుకున్న స్త్రీలంటే, అందులోనూ కాస్త సమర్థతగల స్త్రీలంటే, అసలు గిట్టదు. చదువుకున్న అమ్మాయిల్ని మాటి మాటికి హేళన చేసి, వాళ్ళని సూటిపోటీగా అంటుంటేగాని కొందరికి తృప్తిగా వుండదు. కమల బావ ఆ కోవకు చెందినవాడు. అతని మాటల్లో హాస్యంకంటె యీర్ష్య ఓ పాలు ఎక్కువగా కనిపిస్తూ వుంటుంది. బండి దిగుతూనే, 'గ్రాడ్యుయేట్ కమలా !' 'గ్రాడ్యుయేట్ కమలా !' అంటూ పిలవడం మొదలుపెట్టాడు. ఆ 'గ్రాడ్యుయేట్' అన్నమాట కమల చెవులకి తిట్టుగా వినిపించింది. మధ్య మధ్య మరదలు తన కేలాంటి ప్రెజెంటు యివ్వదలచుకుందో కూడా అడగడం మొదలుపెట్టాడు, బావగారు.

'ఏమండీ, మన గ్రాడ్యుయేట్ గారు పెళ్ళి చేసుకోరా ?' అని అడిగాడు భావ, ఓ రాత్రి అందరూ భోజనాలు చేస్తుంటే. అక్కకి ఆమె భర్త చేసే వేళాకోళం సబబుగా ఉన్నట్టుంది. అక్కకే కాదు ఇంట్లో అందరికీను. ఎటొచ్చీ అతని ధోరణి కమలకే చిరాగ్గావుంది.

'అయ్యో, చేసుకోకేం ? ఆడపిల్లకి పెళ్ళీ పేరంటం గాని, యీ ఉద్యోగాలు దేనికి నాయనా ? సంబంధాలు వెతుకుతూనే వున్నాం; నీ ఎరుకలో ఎవరైనా గుణవంతుడుంటేచూడు,' అంటూ తన ధోరణిలో పడింది కమల తల్లి.

"సంబంధాలకేం, చాలా వున్నాయి. అసలు నేను చెబితే కట్నం కానుకలు లేకుండా చేసుకునే వాళ్ళు ఒకరిద్దరున్నారు," అంటూ ఆగిపోయాడు. అమ్మ నాన్న తమ పాలిటి ఆపద్బాంధవుడు ప్రత్యక్ష్య మయినట్లు చూస్తున్నారు అల్లుడివంక.

"ఏం నాయనా, ఆగిపోయావేం ?"

"ఆఁ ఏంలేదు. నే చెప్పేది వింటే, ఆ బి. ఏ. గారికి కోపం వస్తుందేమోనని భయంగా వుంది" అంటూ తన చలోక్తికి తనే పెద్దగా నవ్వుకున్నాడు, బావ

కమల జవాబు చెప్పలేదు.

"చూడండి మావఁగారూ. పెద్ద ధనవంతుల్లోనూ, గొప్ప ఉద్యోగస్తుల్లోనూ తప్ప, మామూలు మనలాంటివాళ్ళకి చదువుకున్న పిల్లలు అక్కర్లేదు. అందులోనూ బి.ఏ. ప్యాసై ఉద్యోగంకూడా చేస్తూందంటే అసలు అబ్బాయిలు రారు. ఏదో మీపెద్దమ్మాయిలా సామాన్యచదువులైతే చెప్పినమాట వింటూ..." అల్లుడు ఆగిపోయాడు. మావఁగారికి యీ ఉపన్యాసం కాస్త చేదుగానే వుంది. కాని యీ చేదు చాలాసార్లు వినివుండడం మూలాన కాస్త తియ్యగా అనిపించింది.

"ఏదో పిల్ల తెలివయిందని బి. ఏ.దాకా చెప్పించాను. ఇంట్లో ఊరికే వుందని, సరదాపడుతోందని ఉద్యోగంలో పెట్టాను. అదికూడా టెంపరరీయే. నువ్వు సంబంధంచూడు, రేపీపాటికి రిజైన్ చేయిస్తాను. ఆ ముష్టిజీతం దాని చీరలకే చాలదు. ఇంట్లో తోచడంలేదని వెళ్తూంటే వూరుకున్నాను."

ఇలా సాగిపోతోంది వాళ్ళ సంభాషణ.

కమలకి దుఃఖం, కోపం, ఉడుకుమోత్తనం ముంచుకొస్తున్నాయి. గీసి గీసి, ప్రతిసారీ సూటుకోసం, బట్టలకోసం పోట్లాడే యీ బావకి తన చదువుగురించీ, ఉద్యోగంగురించీ మాట్లాడే అర్హత ఎక్కడుంది ? ఆ అధికారం ఎవరిచ్చారు ?

"ఇదిగో బావా, నేను నోరుమూసుకుని వూరుకుంటే మరీ రెచ్చిపోతున్నావు. నేను ఉద్యోగం మానను. నువ్వు నాకు మొగుణ్ణి

తేనక్కర్లేదు. నిన్ను చేసుకుని మాఅక్క, మేము ఇంత సుఖపడుతున్నాం. నువ్వు చెప్పే ఆ అభిప్రాయాలు గల మనిషిని చేసుకునే కంటె ఉరి పోసుకుని చావడం మేలు. నా విషయాల్లో నువ్వు జోక్యం కలిగించుకోకు," అంటూ రయ్యినలేచి వెళ్ళిపోయింది కమల, పక్కెందగ్గరనుంచి.

ఆరాత్రి యింట్లో పెద్ద దుమారం రేగింది. అల్లుడి అలక, అక్క ఏడుపు, అత్తమామల క్షమార్పణలు. అందరూకలసి కమల మీద దాడి. కమల దూకుడుగా అన్నదే గాని, దాని పర్యవసానం ఏమవుతుందోనని భయపడుతూనేవుంది.

తెల్లవారింది.

"అమ్మాయ్, నువ్వా ఉద్యోగానికి రిజైన్ యిచ్చేసెయ్యి. ఏదో సరదా పడుతున్నావని ఊరుకున్నాను. కాని నీలో యింత అహంకారం ప్రబలుతుందనుకోలేదు," అన్నాడు తండ్రి.

కమలకి కళ్ళనీళ్లు తిరిగాయి. ఏదో జవాబు చెబుదామనుకుంది, కాని అక్కా, అమ్మా తనకి పట్టిన అహంభావాన్ని గురించీ, ముఖ్యంగా కిందా మీదా గానక బావగారినే నాలుగు అనే తన ధన గర్వాన్నిగురించీ అనర్గళంగా అని, కమలని ఉక్కిరి బిక్కిరి చేశారు కమలకి నిస్సహాయత, చేతగాని కోపం అన్నీ కలిగాయి. ఆ సాయంత్రం నాలుగ్గంటలకి తండ్రీ బావగారూ ఆఫీసుకొచ్చి, మేనేజరుకి కమల పెళ్లిసాకుచెప్పి రిజైన్ చేయించారు.

ఉద్యోగం రిజైన్‌చేసిన సాయంత్రం కమల ఆవేదనతో, బెంగతో ఏడ్చింది. అటు ఆఫీసుకో తను వెళ్లిపోతున్నదనిగాని, యిటు ఇంటి దగ్గర తను ఉద్యోగం మానేసిందనిగాని విచారించిన వాళ్ళులేరు. అసలు అదేదో పెద్ద అడ్డుతీరినట్లు అంతా సంతృప్తిగా నిట్టూర్చారు.

వచ్చిన జీతమంతా లెక్కగట్టి నయాపైసలతోసహా వసూలు చేసే తండ్రి యీ నెల్లాళ్లూ ఖర్చుల్ని ఎలా ఎదుర్కొంటాడో అని ఆలోచించబోయి, ఆ తలపుల్ని బలవంతాన నెట్టివేసింది కమల. బావగారితో సంఘర్షణ పడ్డప్పటినుంచీ యింట్లోవాళ్లకి కమలకి మధ్య ఓరకం ఉదాసీనత ఏర్పడింది. కమల ఎవరితోనూ మాట్లాడేదికాదు.

బయటికి వెళ్ళేదికాదు. ఏకాంతంగా అలా గంటలు గంటలు కూర్చునేది. పండగ, కొత్తబట్టలు — ఇవన్నీ యాంత్రికంగా చేసుకుపోతోంది. ఏదో పరాధ్యానం, ఒంటరితనం, దిగులు. గుబులు గుబులుగా దుఃఖం ముంచుకొచ్చేది. ఎవరూ చూడకుండా కన్నీళ్లు తుడుచుకునేది.

దాదాపు నెలలు గడచిపోయాయి. బావగారు చెప్పిన పెళ్ళి కొడుకులలో ఒక్కరూ ఈ యింటి ఛాయలకి రాలేదు. ఆ మాట అమ్మా నాన్నా ఏకాంతంగా అనుకున్నా, అక్కదగ్గర ఎత్తే సాహసం ఎవరికీ లేదు. ఈ మధ్యలో ఒకటి రెండు సంబంధాలు వచ్చాయి. కట్నాలు చాలకా, అమ్మాయి సన్నగావుందనీ వెనక్కి వెళ్ళిపోయారు.

ఆ రోజు మధ్యాహ్నం పడకొండింటివేళ దొడ్లో అరుగుమీద కూర్చుంది కమల. మనసు కలవరంగావుంది. అందుకు కారణం లేక పోలేదు. క్రితంరోజు సాయంత్రం తను సరోజని యింటికి వెళ్తానంటే, తండ్రి వెళ్ళటానికి వీల్లేదన్నారు. పూర్వంలేని యీ కట్టుళ్ళకి కమల తట్టుకోలేకుండావుంది. దీనికి వెనక బావగారు నాన్నకి చెప్పిన హితోప దేశం కమలకి లీలగా అర్థమవుతోంది. శూన్యంలోకి చూస్తూ, అంతు లేని ఆలోచనల్లో కొట్టుకుపోతున్న కమల, వీధిలోంచి మామయ్య కంఠం వినడంతోనే తొంగిచూచింది. మామయ్య ఏదో హడావుడిగా ఆ సాయంత్రం రాబోయే పెళ్ళికొడుకు గుణ గణాదులూ, ఆస్తిపాస్తులూ వర్ణిస్తున్నాడు. సాయంత్రం నాలుగున్నరకి పెళ్ళిచూపులకి వస్తాడట.

"అమ్మాయి సుఖపడుతుంది. మంచి ఆస్తి వున్నవాడు. కట్నం, కానుకలు అక్కర్లేదు. రెండో పెళ్ళి అయితేనేం? అట్టే వయసు లేదు. నలభై." ఈ మాటలు కమల చెవుల్లో పడ్డాయి.

మామయ్య వర్ణిస్తున్నచిత్రం అటుక్కుపోయినట్లయింది. రెండో పెళ్ళా? తనతో చిన్నప్పుడు చదివిన సోమరాజూ, సాంబారమ్మా, ఆమె చెల్లెలు—వీళ్ళ దృశ్యాలు సినిమా రీళ్ళలా తిరిగాయి.

పదహారేళ్ళకే పిచ్చిపట్టి, భూతవైద్యాలూ, మందులూ, మాటల్తో మంచమెక్కిన సోమరాజూ, ఆమె అరవైయేళ్ళ భర్తా ఒక్కసారి కళ్ళ ముందుతిరిగారు తనకి రెండో పెళ్ళి భర్తా? తనకికూడా పిచ్చెక్కితే!

అమ్మో! ఏదో గుబులు! భయం! ఎదురుగా వున్న మామిడిచెట్టు కదుల్తోంది...కాయలతో నడిచివస్తోంది...ఆ చెట్టు సోమరాజు భర్తే. పెళ్ళికొడుకు...అదుగో వస్తున్నాడు...కమల కెవ్వున కేకవేసి పడిపోయింది.

కళ్ళుతెరిచి చూసేసరికి మావయ్యా, అక్కా, అమ్మల ముఖాలు కనబడ్డాయి. తన కేదో భయంగా వుందనీ, ఈ పెళ్ళి వద్దనీ చెప్పింది కమల. బలహీనంగా ఉండటంవలన కళ్ళుతిరిగి పడిందని సరిపెట్టుకున్నారు వాళ్ళు.

నాలుగున్నర వేళ పెళ్ళికొడుకు వచ్చాడు. కమలకి ఏదో గుబులుగా భయంగా ఉంది. వెళ్ళి కనపడకపోతే నాన్న తిట్లు; అమ్మ ఏడుపు యివన్నీ తలచుకుని, అయిష్టంగానే వెళ్ళి కూర్చుంది. ఇదివరకటి పెళ్ళికొడుకులకు మల్లేనే యితనికీ తను నచ్చకపోవాలని వెయ్యి దేవుళ్ళకి మొక్కుకుంది.

పెళ్ళికొడుకు బాగానే ఉన్నాడు. అంత వయస్సు కనబడటం లేదు; కమల కళ్ళెత్తి అతని ముఖం లోకి చూచింది. ఎందుకో నాంచారమ్మ భర్త పోలికలు కనిపించాయి ఆ కళ్ళలో. ఆరుగురు పిల్లల్ని కని ఏడో కానుపుకి తనలేక నాంచారమ్మ చచ్చిపోతే, పద్దెనిమిదేళ్ళు నిండని మరదల్ని చేసుకున్నాడు అతను. పద్దెనిమిదేళ్ళు నిండని ఆ అమ్మాయి యీ పిల్లలని పెంచడం, అతనికి భార్య మీద అనుమానం, భార్యను అతను హింసించడం-ఇవన్నీ అలల్లా కమలమస్తిష్కంలో ఎగిరెగిరి పడుతున్నాయి. ఇతను కూడా అలాంటి వాడే అయితే! తనని అనుమానించి కొడితే! ఈ పెళ్ళికొడుకు కళ్ళు క్రూరంగా, తీక్షణంగా తనను చూస్తున్నాయి. ఆ చూపు తన మీదికి పరుగెత్తు కొస్తున్నది. అదుగో కుర్చీ కదుల్తోంది... కుర్చీతోనే వస్తున్నాడు! బాబోయ్!

కమల విరుచుకు పడిపోయింది.



# 4. మబ్బులు విడిపోయాయి

శ్రీమతి దుర్గాకుమారి

"అబ్బ! ఇక తిరగటం నావల్ల కాదే! కాళ్లు పడి పోతున్నాయి!" అంటూ అమాంతం రావిచెట్టు చుట్టూరా కట్టిన గట్టు మీద చతికిలపడి పోయింది కమల.

"నా తల్లి! కదూ! ఇంకొక్క పదిసార్లు ప్రదక్షిణంచేస్తే, స్వామి దర్శనం చేసుకొని యింటికి పోతాంగా!" అని అనునయించబోయింది తల్లి సావిత్రమ్మగారు. ఆమెకు భయంగానే వుంది మొదటినుంచీ, యీ ఉద్దండప్పిడుగు ఏక్షణాన ససేమిరా అని మొరాయిస్తుందోనని.

ఆ మరునాటి రాత్రి ఉన్నట్టుండి లేచి వెళ్ళి మంచంమీద పడుకుంది కమల. ప్రక్కనేవున్న తల్లి లేచి, "ఏం పెంకితనమే! నీ మంచి కోరి చెప్పినా యింతగా మొండికి పడ్డావు. మంచంమీద పడుకోకూడదని తెలియదూ?" సన్నగానే మందలించింది. నిద్రవేళగనక, ఆపిడకూ పరిస్థితి జ్ఞప్తిలేక ఆ మాత్రమైనా గదమాయించిందిగాని, పగలైతే పిల్ల అస్వస్థత విషయం గుర్తే వుండేది.

"కాకిలాగా అస్తమానం యీ చన్నీళ్ల స్నానాలూ, కాళ్లు పీక్కుపోయేలా యీ ప్రదక్షిణాలూ, ప్రాణాచారాలు పడటాలూ, కటికినేలమీద పడుకోడం — ఏమిటమ్మా యిదంతా? నా ప్రాణం తీసి వదలి పెడుతున్నారు కదా! నాకేం రోగమని? లేని పిచ్చలు ఎక్కిస్తున్నారు నిజంగా!" కమల కళ్ళు నీలాల కడవలే అయ్యాయి.

కడుపు తరుక్కుపోయింది తల్లిగారికి. కమలను పొదివిపట్టుకుని కన్నీరుతుడుస్తూ, "అంతా మన గ్రహచారమే అమ్మా! కాకపోతే, నిక్షేపంగా బి. ఏ. ప్యాసయిన దానివి నీకీధోరణి ఏమిటిచెప్పు. వచ్చిన ఉద్యోగమూ వదులుకున్నావుకదా! పెళ్లిచేసి నలుగురిలా మనతాహతుకు తగినంతలోనే అచ్చటా ముచ్చటా చూసుకుందామంటే, ఆ యోగ్యత లేకుండా చేశావుకదా! పల్లెత్తుమాటాడి యెరుగని పిచ్చితల్లివి యీ వితండవాదం ఎక్కడినుంచి వచ్చిందేనీకు? ఇదంతా గ్రహచేష్టందూ? వాటిని శాంతింపచేయడానికి మరి యీ పనులన్నీ చేయకపోతే ఎలా చెప్పమ్మా!" లాలనగానే చెప్పింది. ఆ మాటలు వింటూనే మరింత రెచ్చిపోయింది కమల.

"గ్రహాలు! గ్రహాలు! మీకన్నా గ్రహా లెక్కడున్నాయో! ప్రత్యక్షంగా కనిపించే గ్రహాలదాడికి తట్టుకోలేక, వాటిని ఉపశమింప చేసుకోలేక, కనిపించని గ్రహాలు బాగా లేవని వాపోతారు చచ్చు దద్దమ్మలు!" ఛీత్కారం చేసింది. అంతటితో ఊరుకోలేదు. మెళ్ళో కట్టిన రక్షరేకు పుటుక్కున తెంచి కిటికీలోంచి వీధిలోకి గిరవాటేసింది.

"పీడ విరగడయింది!" అనుకుంటూ గుండెలమీద చేయివేసుకుని హాయిగా మంచమీదనే పడుకుని నిద్రపోయింది కమల.

సావిత్రమ్మగారు నిస్సహాయంగా ఆమెచర్యలన్నీ చూస్తూండడం కన్న మరేమీ చేయలేకపోయారు. ఇవన్నీ పిశాచచేష్టలేనని ఆమెకు గట్టి నమ్మకం. అందుకే, దగ్గరికివెళితే మీదపడి పీక నులమటంలాటి అఘాయిత్యాలు ఇంకేమి చేస్తుందోనని జడిసి, మెల్లగా బయటికి జారుకుని, గదికి గొళ్ళెం పెట్టింది.

తరవాత రెండుమూడు రోజులు ఎవరూ ఆ విషయమే కదిలించ

లేదు. తల్లీ చెల్లెళ్లుకూడా ఆమెనో వింతమనిషిని చూసినట్లు చూడకుం ఆమె గమనించకపోలేదు. తనంటే వారి కదొక భయంగా వుంది. ఆ భావం తనమనస్సుకు ఒక విధమైన దిటవును ప్రసాదించినా, వెంటనే మరోభయం ఆవహించింది కమలను. బడబాగ్ని ప్రజ్వరిల్లేముందు ఉండే ప్రశాంతతలాంటిది కాదుగదా వీరి మౌనం! మొన్న నగా పొరుగూరు వెళ్ళినతండ్రి ఇంతవరకూ యింటికి రాలేదు. వీరంతా మళ్ళీ ఏదో గూడు పుఠాణీ తలపెట్టలేదుకదా! వణికిపోయింది కమల. ఎందుకు తనవాళ్లు యింత నిర్దయులయారు? తన హృదయంలో చెలరేగే సంఘర్షణను తనకు తానే అర్థంచేసుకోలేక సతమత మవుతూంటే, సానుభూతిచూప వలసిందిపోయి యిలా ప్రవర్తిస్తున్నారేమిటి అందరూ?

మొన్న మటుకు మొన్న ఆ దౌర్భాగ్యపు ముసలి పెళ్ళికొడుకు హూరుమంటూ వచ్చిన రోజున తన ప్రవర్తనచూసి అంతా తనకు మతి చలించిందని తీర్మానించారుకదూ! ఆరోజైనా ఎంతో ప్రయత్నం చేసింది తన భావోద్వేగం అణచుకోవాలని. ఛీ! ఆగితేనా? ఆ పరిస్థితిలో ఉన్న తనవంటి ఏ కన్యకైనా అంతటి ఆవేశమూ వస్తుందేమో ననిపించింది కమలకు. అక్కడికీ, వారంతా వెళ్ళిపోయాకనే గౌరవ నీయులైన మామగారు తాను తెచ్చిన యింతోటి సంబంధం చాల దన్నట్లు మరో అమూల్యమైన సలహాకూడా యిచ్చారు.

"దీనికి మతి చలించిందేమో! ఏ పిచ్చాసుపత్రిలోనైనా కొన్నాళ్ళపాటు ఉంచితే మంచిదనుకుంటాను" అన్నాడు, తనవైపు వంకరచూపు చూస్తూ. కమలకు అసహ్యం వేసింది. పెద్దవాళ్ళయి పోయారు కాబట్టి ఆమాత్రం విధిలేక గౌరవించవలసి వచ్చింది గాని, యీ తప్పుడుసలహా యిచ్చినందకు పేడకలిపి చల్లవలసినమాటుకదూ! అసలు వాళ్ళకే మతి చలించిందేమో! ఈ యింట్లో తాను తప్ప అందరూ పిచ్చివాళ్ళు. అందరికీ స్క్రూలు వదులయ్యాయి. ఎంత తమాషా! ఈ ఆలోచన వచ్చేసరికి ఆపుకోలేనంత నవ్వు వచ్చింది ఆమెకు. బిగ్గరగా నవ్వుతూ, "మీ అందరికీ పిచ్చి ముదిరి కొట్టు కొంటున్నారు. పైగా నాకు పిచ్చి అంటున్నారా?" అని లోపలికి వచ్చేసింది.

"చూశావా అక్కా ? పిచ్చివాళ్లధోరణి సరిగ్గా యింతే. వాళ్లకు వెర్రి అని ససేమిరా ఒప్పుకోరు. పైగా ఎదటివాళ్లకే పిచ్చి అంటారు. తప్పకుండా దీన్ని పిచ్చాసుపత్రిలో చేర్చాలిసిందే. అప్పుడు కాని పట్టినవెర్రి వదలదు," అంటూ మొన్న మేనమామ అన్నమాటలు కమల కాళ్లక్రింది భూమిని కృంగదీశాయి. ఇదీ తన పరిస్థితి. తన మాటను ఎవరూ వినిపించుకోరు. తాను ఏమి మాట్లాడబోయినా గ్రహమనో, ఉన్మాదమనో తేలుస్తున్నారు. ఈ మధ్య ఏదో మఠానికి తీసుకెళ్లారు. అక్కడ వడపప్పు తినటం, పానకం తాగటం, అవి అరి గిందాకా "హరేరామ, హరేకృష్ణ!" అని చెవులు చిల్లుబడేలా అరవటం, చేతులు కాయలు కాచేలా తాళాలు వేయటం. అలాగని కమలకు దైవభక్తిలేదని కాదు దేవుడంటే ఆమెకు ఎంతో భక్తి ప్రపత్తులున్నాయి. కాని యీ బాహ్యప్రదర్శన, లేని భక్తిని అభిన యించటం, మధ్యలో తన్మయత్వం నటించటం – యివన్నీ పరమ రోత పుట్టించాయి.

ఎవరో గొప్ప స్వాములవారట. ఆయన చేత వేదాంతబోధ చేయించబోయారు తన వాళ్ళు. ఏమిటి వీళ్ళ ఉద్దేశం ? తనలో విరక్తి రగిలి సన్యసించిపోవాలా ? తాను లోకపు బాధ్యతలనుంచి పారి పోవాలని కోరటం లేదే! ప్రతి స్త్రీ కలలుకనే మధురమైన బాధ్యతలే తనకూ కావాలి. తనను అర్థం చేసుకునే భాగస్వామి...ప్రశాంత జీవనం ఇవన్నీ కావాలి. కాని అవి వచ్చే అవకాశాలు మృగ్యం అవుతున్నాయి. తన ప్రస్తుత పరిస్థితిలో తన కోరికలకు తగిన న్యాయం జరగటం లేదు. పోనీ, పరిస్థితులకు అనుగుణంగా కోరికలన్నా మారడం లేదు. ఎలా ? ఈ నిరంతరసంఘర్షణలో నలిగిపోతోంది కమల. తనకు యీ బ్రతుకు ఏమీ యివ్వలేదా ? తాను చేయ గలిగింది ఏదీ లేదా ? జీవితం నిస్సారమనిపిస్తోంది కమలకు. ఆమెకు తెలుసు పిచ్చాసుపత్రిలో బ్రతుకు ఎంత దుర్భరమో. ఒకసారి కళ్ళారా చూచింది కూడ. ఏ కాస్త మనస్సు స్వాధీనంలో వున్నా అదీ పోతుంది అక్కడికి వెళ్ళగానే. ఇవన్నీ తప్పించుకునే తెలివైన మార్గం ఒక్కటే కనిపిస్తోంది: ఎవరితోనూ పలక్కుండా వుంటే సరి. ఎప్పుడూ తనను

రెచ్చ గొట్టే సంభాషణలు రావు. తాను రెచ్చిపోయే అవకాశమూ ఉండదు. అదీగాక, యింత జరిగిన తరవాత ఈ యింట్లో నివసించే ప్రతి వ్యక్తి మీద కమలకు ఒక విధమైన అసహ్యం పుట్టుకొచ్చింది. వేళకు ఏదో యింత భోజనం చేయడం, ఒక మూల కూచోడం ... అలా అలా తనలో తాను ముడుచుకుపోసాగింది కమల. ఇదీ ఒక విధంగా బాగానే వుందనుకున్నారు యింట్లోవాళ్ళు, లోలోపల బాధపడ్డా.

* * *

శారదాంబగారి రాకతో కమలలో చైతన్యం వచ్చింది. ఆమెకు గారాబాల మేనకోడలే అయినా, ఈ సంగతి నలుగురికీ ప్రచారం చేసుకున్నట్లవుతుందని, తండ్రి ఆమెకు కమల విషయం ఇంతకుముందు తెలియజేయలేదు. వచ్చే నెలలో ఆవిడ పెద్దకూతురు రాధ పెళ్ళి పనులకు సాయంగా వదినగారిని పంపమని అడగడానికి వచ్చిందావిడ. "ఇంత ముందుగానా?" అని నీళ్ళు నమిలింది సావిత్రమ్మ. ఆవిడ మనస్సులో బాధ వేరు. చూస్తూండగానే అందరి పిల్లల పెళ్ళిళ్ళూ అవుతున్నాయి, తనబిడ్డకు ఏమీ లోపం లేకపోయినా ఈ స్థితిపట్టిందేమా అని. అందరినీ ఆశ్చర్యచకితుల్ని చేస్తూ, కమల లేచి "నేను అత్తయ్యగారి ఊరు వెళ్తానాన్నా. అమ్మకు ఇంటిపని సరిపోతోంది కదా! నాకూ కాస్త మనసుకు బాగుంటుందేమో అక్కడ. ఆ మాత్రం పనుల్లో అత్తయ్యకు కాస్త సాయం చేయలేనూ?" అంది నవ్వుతూ.

"నువ్వా? అక్కడ ఏ పేచీలూ లేవుకదా?" ఆశ్చర్యంలోంచి తెప్పరిల్లుకుంటూ అడిగింది తల్లి.

"మరేం ఫర్వాలేదు!"

"అయితే ఒక్క షరతు అత్తయ్యా. ఎవరూ నా ఎదురుగుండా ఈ పిల్లను ఏ వూరిచ్చారనిగాని, యింకా పెళ్ళి కాలేదా అనిగాని అడక్కుండా చూడు. లేకపోతే నాకు చిరాకెత్తుతుంది. సరేనా?"

"అలాగే తల్లీ," అన్నది మేనత్త. ఈ రెండురోజుల్లో కమల విషయాలన్నీ వదినగారిద్వారా వినే వుంది ఆవిడ.

ఆ పరిసరాలలోంచి బయటపడి స్వేచ్ఛా వాయువులు పీలుస్తూ

వుంటే కమలకు ప్రాణం ఎంతో హాయిగా వుంది. 'వచ్చావా కమల ఒదినా ?' అంటూ చుట్టూరా చేరిన రాధ, వసంత, బాబ్జీలలో తన చెల్లెళ్ళలో కనిపించని వాత్సల్యం గోచరించింది.

ప్రశాంతమైన పల్లెటూరి వాతావరణం. పచ్చని పంటచేలు, ముత్యాలు తాపిన పచ్చడంలా మెరిసిపోయే ధనియాల మళ్ళు, గుమ్మడి పూలతో శోభించే ఆ ప్రాంతం నిజంగా నలిగిపోయిన ఆమె మనసుకు ఎంతో ఊరటనిచ్చింది. సాయంకాల మయేసరికి రాధ యీడు అమ్మాయిలంతా పావడా, వల్లెవాట్లతో జడగంటలు వేసుకుని బిలబిలా వచ్చేసేవారు. రాధతోపాటు తననీ లాక్కు వెళ్ళేవారు. ఊరిమధ్యలో వేణుగోపాలస్వామి ఆలయం. దాని చుట్టూరా అందమైన పూలతోట. అందులో పూలుకోసి మాలలు కట్టి స్వామికి అర్పించడం, సంధ్య హారతి యిచ్చేవేళ దగ్గర వుంచడం, అర్చన అవగానే భక్తితో ప్రసాదం స్వీకరించి కాసేపు ఆడుకుని మళ్ళీ జట్లుగా యిళ్ళకు వెళ్ళడం — ఆ కన్యలకు సాయంవేళల పరిపాటి. రాధతోపాటు వాళ్ళంతా కమలను 'వదినా !' అంటూ చుట్టూరాచేరి, వారిమధ్య గల నాలుగైదు సంవత్సరాల వయో భేదాన్నీ, ఆమె బి. ఏ. చదువునీ, కాలేజీలో అలవరచుకున్న గాంభీర్యాన్నీ విస్మరింపజేసేవారు. వారితో ఉయ్యాలలూగే వేళల్లో పెద్ద పెద్ద ఊపులువేసి, తట్టుకోలేకపోతే భర్తపేరు చెప్పమనేవారు. కన్నె పిల్లలు సూర్యుడి పేరో, చంద్రుడిపేరో చెప్పాలి. రాధకు పెళ్లి నిశ్చయమయింది కాబట్టి ఆమె సిగ్గుల్లో మొగ్గలా ముడుచుకు పోతూ 'కృష్ణమోహన్' అని చెప్పిందాకా వదిలేవారు కాదు.

ఇవన్నీ కమలకు ఎంతో మధురంగా కనిపించాయి. ఆమె యింట్లో మేనత్తకు కుడిభుజంలా ఉంటూంది. వండిన పిండివంటలు లెక్కచూచుకొని భోషాణాల్లో సర్దించడం, వెన్నంతా కరిగించి జాడీల్లో పోయించడం – ఒకటేమిటి అన్నిటికీ నేనున్నానంటూ పెత్తనమంతా పైనవేసుకుని చలాకీగా కమల తిరుగుతూంటే, ప్రతివారూ 'కాలేజీ చదువు చదువుకున్నా అలావుండాలి! ఎంతటి పనివంతురాలో! ఎంతటి తీరువో !' అనేవారు. ఆ మాటలకు ఆమె హృదయం మురిసిపోయేది.

ఇక్కడ తనను అడుగడుగునా విమర్శించేవారు లేరు, అంతా తనను మెచ్చుకునేవారేగాని. ఈ భావమే ఆమెకు ఉపశాంతిని కలిగించి మనసును దూదిపింజెలా చేసింది.

రాధ పెళ్ళికూతురై గౌరీపూజ చేసుకుంటోంది కమల ఆమెకు దగ్గరగా వెళ్ళి కూచుంది. రాధ నవ లావణ్యం, అందుకు మరింత వన్నె తెచ్చే ఆ మనోజ్ఞమైన అలంకరణ చూసి, ఎలాంటి కన్యకైనా పెళ్ళి నాడు ఎంతటి అందం వస్తుందో కదా అనిపించింది కమలకు. "అదుగో! పెళ్ళివారు పందిట్లోకి వచ్చారు. మా తమ్ముణ్ణి చూస్తావా రాధా?" మేలమాడింది రాధను.

"పో వదినా, నీవు మరీను! అని మరింత సిగ్గుపడిపోయింది రాధ. ఆ కన్నెపిల్ల లేయెదలో గుబాళించిన తొలివలపు కుసుమపు నెత్తావి అలసిన కమల హృదయాన్ని తాకి, సేదతీర్చి, గిలిగింతలు పెట్టింది. అంతా ఏమిటో కొత్తగావుంది కమలకు. తనలో ఏవేవో భావాలు దొర్లుకుపోతున్నాయి. ఇక్కడికి వచ్చింది మొదలు తనలో ఏదో తీయని తపన, ఏవో భావాలు ఉక్కిరిబిక్కిరి చేస్తున్నాయి. అవన్నీ ఏ స్నేహితురాలిపేరనైనా ఉత్తరంఅన్నా రాస్తేనో! ఆ భావాల బరువు కాస్త తగ్గి కొంచెం ఊపిరిసలపవచ్చు!

అనుకోని రీతి కాగితంమీద కలంపెట్టి తన భావాలకు రూప కల్పన చేసింది కమల. లేఖకు బదులు చక్కని కథ తయారయింది. విస్తుబోతూ, దీన్ని పత్రికకు పంపితేనో అనుకొంది. అలా ప్రారంభ మయింది ఆమె రచనావ్యాసంగం. ఒక్కొక్క కథ అచ్చయ్యేకొద్దీ ఆమెలో ఉత్సాహం, పట్టుదల అధికమవసాగాయి.

రాధ పెళ్ళికివచ్చిన తల్లీతండ్రీ కమలను తమతో యింటికి తీసు కెళ్ళారు. ఆమె ఆరోగ్యం బాగుపడుతూన్న సూచనలు కనిపించి, వాళ్ళు ఎంతో సంబరాలుపడ్డారు.

అయితే కమలకు ఆశ్చర్యం కలిగించిందిమరొకటుంది. దేన్నయితే వాస్తవిక జగతిలో మానవులు తప్పించుకోవాలనుకుంటారో, గర్హి స్తారో, దేనికైతే భయపడతారో అవన్నీ రచనల్లో అంతగా ఆమో

దిస్తారేం? ఒక వ్యక్తి నిజంగా ఎంతోబాధపడితే, "అయ్యో పాపం!" అనరు. వారే, కథల్లో పాత్రలు అదేరకం బాధలు పడ్డట్టు చదవగానే ఓ గంటసేపు కన్నీరు కారుస్తారు. ఇదెలా జరుగుతోంది? ఈ కీలకం ఎక్కడుంది? ఒకటి అయివుండవచ్చు ననుకొంది. పాత్రలపట్ల సానుభూతిచూపినా వాటి కష్టాలను తొలగించడానికి మానవుడు ఏమీ శ్రమపడనక్కర్లేదు. అదేనిజంగా తోడివ్యక్తి కష్టంలో వున్నట్లుతెలిసి సానుభూతి చూపినట్లయితే సహాయం చేయవలసిన అవసరం రాదూ?

ఏమిటో యిదంతా యథార్థ జీవితానికీ, కథల్లో మనుష్యులకూ ఎంతోభేదం కనిపిస్తుంది. అయినా, తన భావాలబరువును తీర్చుకోడానికి కమల కథలు రాస్తూనేవుంది. తనలోని సంఘర్షణను గురించి, తనకు సానుభూతిచూపలేని వారంతా తన కథల్లోని పాత్రల సంఘర్షణల్ని అర్థంచేసుకుని, "అయ్యోపాపం!" అంటున్నారు.

* * *

"ఏం మనుష్యులు!" అని కసిగా నవ్వుకుంది కమల. "ఏం ఘనకార్యం తలపెట్టావు పిల్లా!" అంది కమల, చనువుగా, మందలింపు స్వరంతో. "మరేం చెయ్యను చెప్పండి!" ఈ స్థితిలో అర్థోక్తిలో ఆగిపోయింది ఆ కొత్త అమ్మాయి. కమలే గనక సమయానికి పైనుంచి రాకపోతే, పూర్తిగా మునిగిపోయి వుండేదే ఆ పిల్ల. ఓపిగ్గా ఆమె కథనం విన్నది కమల.

"చూడు పద్మా! లోకంలో యింతమందీ సుఖంగా వుండటానికే బ్రతుకుతున్నారనుకోకు. నూరేళ్ల జీవితంలో సుఖం ఏకొద్దిక్షణాలోలభ్యమవుతుంది. ఆ క్షణాలు జీవితాంతం మననం చేసుకుంటూ గడపడానికి, వాటికోసం ఎదురుచూస్తూనే ప్రతివారూ తమ బ్రతుకులు యిన్ని కష్టాల్లోను వెళ్ళదీసుకునేది. వీరంతా నీలాగ చావలేకనే బ్రతుకుతున్నా వంటావా? కేవలం పరీక్ష మూడుసార్లు తప్పినందుకే ఆత్మహత్యకు పూనుకున్నావే! ఇంతకంటె ఎక్కువ బాధలు అనుభవించి, అడుగడుగునా ఆశాభంగాలు చెందుతూకూడ బ్రతుకుతూనేవున్న

వారివైపు ఎందుకు చూడవు? జీవితం అంటేనే ఒక ప్రశ్నాపత్రం. ఇందులో ఒకదాని వెంట ఒకటి అన్నీ సమస్యలే. తీరిగ్గా అన్నీ చదువుకుని తరువాత జవాబు యిద్దామంటే వ్యవధి లేదు. దేని కది చదువుకుపోతూ, వీలైనవి పరిష్కరించుకోవలసిందే. ఎదురైన మొదటి సమస్యకే తట్టుకోలేక పారిపోవాలనుకోవటం కేవలం పిరికితనం కాదూ?

తన మాటలకు తనే విస్తుపోతోంది కమల. ఈ మాటలన్నీ తనవేనా? ఈ నిబ్బరమైన కంఠం తనదేనా? ఒకరికి ధైర్యం చెప్పబోతూ తనకు తెలియకుండా తనకే ధైర్యం చెప్పుకుంటూందా?

"మరెలా చెప్పండి? మా నాన్న నా మీద ఎన్నో ఆశలు పెట్టుకున్నారు. నేనేమో యిలా దండయాత్రలు చేస్తూ వుంటిని." నీళ్ళు కారి పోయింది పద్మ.

"మరేమీ భయపడకు! ఈ మాత్రానికేనా? నిన్ను ఈ సారి పరీక్ష ప్యాసు చేయించే పూచీ నాది. రోజూ నా దగ్గరకిరా. సరేనా? ఇక పద." అంటూ బయలుదేరదీసింది.

ఇప్పుడు కమలకు నిజంగా కొత్తజీవితం మొదలైనట్లుంది. ఇంతవరకూ తనలో ఒకర్ని రక్షించే శక్తివుందని ఆమెకు తెలియదు. తనకుతానుగా స్వీకరించి పైన వేసుకున్న యీ బాధ్యత ఆమెకెంతో ఆత్మవిశ్వాసాన్నీ, శక్తినీ ప్రసాదించింది. పద్మ తనపట్లచూపే కృతజ్ఞత ఆమెను ఎంతో ఉన్నతురాలిని చేసింది. ఇక ఫరవాలేదు. తాను చేయవలసిన పనులూ ఉన్నాయి. తన ఉనికికి ప్రయోజనం, తన బ్రతుకుకు భాష్యం ఆమెకు కనిపించాయి. ఒక్కసారిగా ఆమె హృదయాంబరంలో ముసిరిన కారుమేఘాలు చెదిరిపోయాయి.

*

# 5. ప్రజాసేవ

శ్రీమతి ఇల్లిందల సరస్వతీదేవి

ప్రాణదానంచేసిన అమ్మాయికే విద్యాదానంకూడ చేయడంలో ఒక విధమైన భావం కమల మనసులో ఉదయించింది. వాళ్ళిద్దరి మధ్య గురు శిష్య సంబంధం ఏర్పడ్డది. శిష్య వాత్సల్యంతో ఆమె మనసు నిండిపోయింది. ఆ శిష్యురాలి మీద ఎంత మమకారం పుట్టుకొచ్చిందంటే, తను ఎంత కష్టపడి చదివినా బి. ఏ. ప్యాసయిందే గాని, క్లాసు తెచ్చుకోలేకపోయింది. అటువంటి లోపం తన శిష్యురాలికి కలగనివ్వ కూడదన్న పట్టుదలతో ఆ అమ్మాయి పుస్తకాలన్నీ తాను చదివి ప్రశ్నోత్తరాలు తయారు చేసింది. అవన్నీ ఆమెచేత బాగా చదివించింది. పరీక్షల్లో అన్నీ తాననుకున్నవే వచ్చాయి. తాను పరీక్షకు వెళ్ళి తెలిసిన ప్రశ్నలు వ్రాసినట్లే కమల మనసు గంతులు వేసింది. ఫలితాలు ప్రకటింపబడిననాడు తాను పరీక్ష ప్యాసయినట్లే బ్రహ్మానంద పడ్డది.

అమ్మాయి పరీక్ష ప్యాసయేసరికి తండ్రికి ఎక్కడలేని ఉత్సాహమూ పుట్టుకొచ్చింది "అమ్మాయికి సరియైన శిక్షణే వుంటే నిరుడు ప్యాసుకాకపోయేదా ? ఇంతకూ దాని తప్పేమీలేదు," అనుకున్నాడు. అమ్మాయి విజయానికి కారకురాలైన కమలను అభినందించాడు.

"ఏమండీ, కమలగారూ! మీరు మాకుచేసిన మేలు ఈ జన్మలో మరువలేను. అమ్మాయికి ప్రాణదానమే కాదు, విద్యాదానం కూడా చేశారు. మీదగ్గర యింత శక్తి సామర్థ్యాలు ఉన్నాయనుకోలేదు సుమండీ! మిమ్మల్ని చూస్తూంటే నాకో ఆశ కలుగుతోంది," అన్నాడు.

"ఏమిటండీ అది ?" ఆశ్చర్యంతో అడిగింది.

"ఏంలేదు, భయపడకండి. ఇక్కడ స్త్రీలకు ఒక సేవా కేంద్రం స్థాపించాలని నా కెంతకాలంనుంచో కోరిక. దానికి తగిన వ్యక్తి లభించక ప్రారంభించలేదు. మిమ్మల్ని చూస్తూంటే, ఆ కోరిక తిరిగి మొలకలెత్తుతోంది."

"దానికే ? మీరు అన్ని హంగులూ కల్పించండి, నా చేతనైనంత కృషి నేను చేస్తాను. నా మనసుకు కూడా ఏదో పనిచేస్తున్నా నన్న సంతృప్తి కలుగుతుంది" అన్నది కమల ఆశతో.

ఇద్దరూ కలిసి ఆలోచించి, అంబరు చరఖా, కుట్టుపనీ, వయోజన విద్య — యీ మూడింటికీ తరగతులు ప్రారంభించాలని నిశ్చయించారు. ఆయన పలుకుబడి కలవాడు గనక, పదిహేనురోజులకల్లా చరఖా సంఘం వారితో సంప్రతించి యాభై చరఖాలు తెప్పించాడు. లఘు పరిశ్రమల కేంద్రంతో సంప్రతించి ఆరు కుట్టుమిషన్లు తెప్పించాడు. ఆయన వెళ్ళి అడగ్గానే ఒక సెట్టి తన యిల్లొకటి సేవాసంఘ కార్యక్రమాలకిచ్చాడు. కమల ఉత్సాహంతో సభ్యురాండ్రను చేర్పించింది. యాభైమంది సామాన్య కుటుంబాలకు చెందిన స్త్రీలు చరఖా నేర్చుకోడానికి వచ్చారు. ఆడా మగా కలిసి యాభైమంది వరకూ సాయంకాలపు వేళ చదువు నేర్చుకోటానికి వచ్చారు. ముప్పై మంది దాకా స్త్రీలు బట్టలు కత్తిరించి కుట్టడం నేర్చుకోటానికివచ్చారు.

మిగతా రెండు తరగతులూ కమల పర్యవేక్షిస్తూ, వయోజనులకు చదువు చెప్పటానికి మాత్రం పూనుకున్నది.

రెండు నెలలయే సరికల్లా, ఆ సంఘం అభివృద్ధి చూచి,కమలకే కళ్లు కుట్టినట్లయింది. ఆ పిల్ల తండ్రికి మరీను. అక్కడి విద్యార్థుల సంఖ్య ఆరు నెలలయేసరికి ఇబ్బడి అయింది. సంతోషంకొద్దీ ఆయన తగు ఏర్పాట్లు చేస్తూ వచ్చారు. కమల తన సామర్థ్యంకొద్దీ నిర్వహించుకుంటూ పోయింది. కమలకు ఈ సేవాసంఘం ప్రారంభించిన దగ్గర్నుంచీ మెదడు చురుగ్గా పనిచేయటం మొదలుపెట్టింది. ఉద్యోగం వదలిపెట్టిన తర్వాత ఆమెలో కలిగిన నైరాశ్యం ఇప్పుడు లేదు. పెళ్ళిచూపులకని వరులు వచ్చి నచ్చకపోయిననాటి దైన్యం ఆమెలో ఇప్పుడు లేదు. తలిదండ్రులు తన కష్టసుఖాలు సరిగా విచారించలేదన్న బాధ ఇప్పుడు లేదు. ఇప్పు డామె మనసు, హృదయం నవచైతన్యంతో ఊగిపోతున్నాయి. మనిషి మనసు, హృదయం సరిగాఉండడమే ఆరోగ్యం.

చూస్తూ చూస్తూ వుండగానే వార్షికోత్సవం సమీపించింది. ఫలించిన కృషినిగురించి ప్రజలముందర ఏకరువు పెట్టవలసిన దినం. "వార్షికోత్సవాలు పెద్దయెత్తున చేయాలండీ!" అన్నది కమల. "అధ్యక్షులెవరు?" అని ఆయన ప్రశ్నించారు. ఇద్దరూ కలిసి సలహా సంఘాన్ని సంప్రతించారు. అందరూ కలిసి లఘు పరిశ్రమల శాఖాధికారిని అహ్వానించటానికి సమ్మతించారు. ఆ ఉత్సవంలో ఒక నాటకం, డాన్స్, లలిత సంగీతం పెట్టాలని కమల అన్నది. అంతా సరేనన్నారు.

వార్షికోత్సవాల ముందర సేవాసంఘం సమావేశమయింది. వార్షికోత్సవాలకు ఖర్చుపెట్టవలసిన డబ్బు పెద్ద మొత్తమయినా, కమల సభ్యుల్ని ప్రోత్సాహపరచింది. అంతా ఒప్పుకున్నారు. కాని కోశాధికారి అంత డబ్బులేదన్నాడు. అందరూ కలిసి లెక్కలు వినిపించమన్నారు. ఆయన చూపించిన మొత్తాలు కంటికి కనపడ్డం లేదు. కొంత సొమ్ము ఉపసంఘ కార్యదర్శుల దగ్గర ఉన్నట్లు చూపించాడు.

కమలకు ఆయనేదో కుంభకోణం చేసినట్లు అనుమానం తగి

లింది. వార్షికోత్సవాల లోపల ఆ సొమ్మంతా యిచ్చేయ్యమని ఆమె చెప్పింది. తక్కిన సభ్యులు కూడా నొక్కి చెప్పారు. కమల తన మన సంతా కార్యక్రమం పైకి తిప్పింది. నాటకం వేయాలని ఉబలాటమే గాని ఏం నాటకం వెయ్యాలో ఆమెకే తెలియలేదు. అప్పుడు ఆయనే "ఒక కవిగారున్నారమ్మా! పంపనా?" అంటూ, మర్నాడే పంపించారు. ఆయన పేరు ఏల్చూరి సుబ్బారావు. అంత పేరూ తగ్గించి ఏ. సు అని పెట్టుకున్నారు. నాటకం మాట చెప్పగానే, "అదెంతసేపు? చిటికెల మీద పని." అంటూ రెండు రోజులకల్లా ఒక మంచి సంగీత రూపకం వ్రాసి పట్టుకొచ్చారు. మాటలయితే ఎలాగయినా నేర్పవచ్చు- మరి పాటలో! వాటికి ప్రత్యేక రాగాలు కావాలాయెను మరి. కమల తోడుగా వుంటే నాటకం పిల్లలకు నేర్పుతానన్నాడు. కమల చదువు చెప్పే వయోజనులలో కామాక్షమ్మ ఒకతె. ఆమెకు పదమూడేళ్ల కూతురుంది. చక్కని కంఠం, తీగవంటి దేహం. ఆ అమ్మాయికి పాట, నృత్యం నేర్పుతాను పంపమని కమల అడిగింది. ఆమె సరే నన్నది. ఆ పిల్లకు తోడుగా మరొక పదకొండుమంది పిల్లలను కమల జత చేసింది. వాళ్ళలో ఆరుగురు కృష్ణులు, ఆరుగురు గోపికలూను. ఈ పన్నెండు మందికి రాసక్రీడ నృత్యం, పాటలూ కమలే స్వయంగా నేర్పటం మొదలు పెట్టింది.

అన్నిరకాల క్లాసులూ అయిపోయిన తరువాత, అంటే సాయంత్రం ఆరుగంటల తరువాత, పిల్లలందరూ సేవాసంఘానికి వచ్చేవారు. కమల తాను పాడుతూ డాన్స్ చేస్తూ వాళ్లకు చూపించేది; ఈ పాటలన్నీ ముందు ఏ. సు. కవి దగ్గర తాను నేర్చుకునేది.

ఒకసారి సాయంత్రం 7 గంటలకు పిల్లలకు రాసక్రీడ నృత్యం నేర్పి కమల బయటికి వస్తున్నది. ఆ యింటికి పెరటివైపున కామాక్షమ్మ మొగుడు చెట్టు దిగుతున్నాడు. అతన్ని చూడగానే కమల గుండె గతుక్కుమన్నది. ఆయన చెట్టెందు కెక్కాడు? ఎంతసేపయి వుంటుంది? ఇంతసేపూ ఏం చేశాడు? ఆమె గుండె గబగబ కొట్టుకోవడం మొదలుపెట్టింది. అసలు రోజూ గదిలో డాన్స్ నేర్పుతూ

ఛండేది. అటువంటిది ఇవాళ పెరట్లోచేసి చూపించింది. కొంపతీసి ఈయన అప్పటినుంచీ అదే చూడటంలేదు కదా!

కమల తలవంచుకొని వెళ్ళిపోయింది. తన గదికి వెళ్ళి గట్టిగా తలుపుగొళ్ళెం పెట్టుకొని కాసేపు పడుకుంది.

వార్షికోత్సవం సరిగా వారం రోజులుంది. ఆయన ఒక పెద్ద ఖాళీస్థలం చూసిపెట్టాడు. పందిళ్ళువేసి దళ్ళు కట్టించడంలో నిమగ్నుడై పోయాడు. ఎందుకంటే పల్లెటూరు కదూ — కాస్త ఎక్కడయినా, ఏదయినా జరుగుతోందంటే మామూలు జనమంతా విరగబడిపోతారు. వాళ్ళను అదుపులో పెట్టటానికి తలప్రాణం తోకకు వస్తుంది. అందరికీ వినబడేలా ఆయన లౌడ్‌స్పీకర్లు తెప్పించి అమరుస్తున్నాడు. పందిరి స్తంభాలకు రంగు కాగితాలంటిస్తూంటే, యీలోపల పిల్లమూక చింపటం మొదలెట్టారు. దాంతో ఆ పని మళ్ళీ మొదటికి వచ్చింది.

అవి చీకటి రోజులు. ఇది కనిపెట్టి కమల పిల్లలను త్వరగానే యిళ్ళకు పంపటం మొదలుపెట్టింది; ఆ రోజు కమల పిల్లలతో ఎప్పటి మాదిరిగా డాన్స్ చేయించడం లేదు. వాళ్ళకు ప్రత్యేకంగా కుట్టించిన బట్టలతో వేషాలు వేసింది. మధ్యగా తను నిలబడి పిల్లనగ్రోవి వాయించుతున్నది. పిల్లలందరూ ఆమె చుట్టూ చేరి పాడుతూ నాట్యం చేస్తున్నారు. కమల తన్మయత్వంలో మురళి వాయిస్తున్నది. అలా అయిదు నిమిషాలు ఉన్న తరవాత కళ్ళు తెరచిచూచింది. ఆమె కళ్ళు విప్పివిప్పడంతోనే, ముసుగు వేసుకుని కామాక్షమ్మ మొగుడు గోడ వారగా కనబడ్డాడు. కమలకు గుండె జల్లుమన్నది. కొంత సేపటికి తెప్పరించుకొని, "ఎవరు?" అని గట్టిగా కేకవేసింది. జవాబు రాలేదు. కమల దగ్గరికి వెళ్ళి "ఎవరు?" అని గద్దించి అడిగింది. ఇంతలో కామాక్షమ్మ కూతురు "మా నాన్నండీ!" అన్నది.

"మీరెట్లా వచ్చారు? తలుపులన్నీ వేసివున్నాయిగా!" అన్నది కమల కొంత కటువుగా. "చీకటిరోజులు కదండీ! చిన్నపిల్ల ఒక్కతే వస్తుందని తోడువచ్చాను," అన్నాడు. "అయితే మాత్రం? దొంగ తనంగా రావాలా?" అన్నది కమల. అతడు మాట్లాడలేదు. కాని

కమల, అతడు చెట్టెక్కి దిగగా ఒకనాడు చూచింది. అలాగే చెట్టెక్కి యిటువైపు దిగాడనుకొంది. ఆమెకు కోపం ఆగలేదు. 'ఆడవాళ్ళు ఉన్నచోటికి దొంగతనంగా వచ్చేవాళ్ళు ఏం పెద్దమనుషులండీ!' అంటూ చీవాట్లుపెట్టింది

అతడు మాట్లాడకుండా తలవంచుకొని వెళ్ళిపోయాడు. కమల పిల్లలందరినీ జాగ్రత్తగా యిళ్ళకుచేర్చి తానూ బయలుదేరింది. రెండు రోజులవరకు యీ విషయాన్ని మరచిపోలేకపోయింది. తరవాత పూర్తిగా విస్మరించింది.

రేపులేదు ఎల్లుండి వార్షికోత్సవమనగా, సలహాసంఘం వారం దరూ కమల నేర్పుతున్న రాసక్రీడ రిహార్సలు చూడాలన్నారు. దానికితగిన ఏర్పాట్లుచేసి కమల వారందరినీ ఆహ్వానించింది. వాళ్లం దరూ కుర్చీలమీద కూర్చుని పిల్లలు డాన్సుచేస్తూంటే తదేక దీక్షతో చూశారు. నాట్యంబాగా ఉందని ప్రశంసించారు. కమల మంచిశిక్షణ యిచ్చిందని మెచ్చుకొన్నారు.

అందరూలేచి యిళ్లకు వెళ్తూంటే, ఎవరో వెనక్కుతిరిగి చూశారు. ఆయన అక్కడే నిలబడ్డంతో అంతా ఆగారు. ఏవో గోడల నిండా వ్రాతలు. కొందరవిచూచి నవ్వారు. కొందరు గుసగుసలాడారు. కమలకు ఆ నవ్వులు, గుసగుసలు మొదట అర్థం కాలేదు. తీరా వాకి ట్లోకి వచ్చేసరికి ఆమె కంటబడ్డాయి ఆ వ్రాతలు. ఆమెకు నిలువెల్లా కంపం పుట్టుకొచ్చింది ఇంత దుర్మార్గానికి ఒడిగట్టిన వాళ్లెవరు? వాళ్లకు తానేమి అపకారం చేసింది? ఈ పల్లెటూళ్ళో మారుమూల చేతనైనంత ప్రజాసేవచేస్తూ మనసును ఆనందింప చేసుకొంటున్నదే! చరఖా తిప్పటం నేర్చుకున్నవాళ్ళు రోజుకు రు. 1-50 తెచ్చుకొని పొట్టగడుపుకొంటున్నారు. మిషనుమీద బట్టలుకుట్టడం నేర్చుకున్న వాళ్ళు చక్కగా జాకెట్లు, గౌనులు కూలికికుట్టి డబ్బు సంపాదించు కుంటున్నారు. వయోజన తరగతిలో అందరూ పుస్తకాలు చదువు తున్నారు. పల్లెటూళ్లలో ఎంత పనైనా ఎటువంటి పనైనా చేయవచ్చు

ననుకొన్నది. పల్లెటూళ్లకు తనవంటివాళ్ళు నలుగురు బయలుదేరితే సంస్కరించ వచ్చుననుకొన్నది యింతవరకూ.

కాని... ...కాని... ...యీ వ్రాత కేమిటి? తను ఆయనను తండ్రిగా భావించింది. ఆ ఉద్దేశంతోనే ఆయన కూతురికి చదువు చెప్పే భారం వహించింది. తండ్రి మాదిరిగానే ఆయన కూడా చనువుగా "ఏమిటమ్మా!" అని పలకరిస్తారు. కూతురిలాగే తానూ "ఏమిటండీ?" అంటుంది. అటువంటి ఆయనతోనా తనకు సంబంధం? వ్రాసినవాడికి ఎటువంటి ఆలోచన తట్టింది!

కమలకు ఆ రాత్రి భోజనం సహించలేదు. కంటిమీద కునుకు లేదు.

ఆయన, కోశాధికారి వద్దకు వెళ్ళితేగాని డబ్బు వసూలు కాలేదన్నాడు. కార్యదర్శులు అంతులేరన్నాడు. వార్షికోత్సవం సమీపించింది. సంఘానికి కొన్ని వందలు నిలవఉండాలి. కాని రాగి దమ్మిడీ అయినా కనబడటం లేదు. ఆలోచిస్తూ ఆయన సభాలంకరణ కోసం పందిట్లోకి వెళ్ళారు. ఇంకేముంది? ప్రతి స్తంభానికీ ఒక అట్ట — కమలకూ ఆయనకూ గల "సంబంధాన్ని" వివరిస్తూ వ్రాసింది కట్టబడి వున్నది. వాటిని చూస్తూనే ఆయన నిలువునా కూలబడిపోయారు.



# 6. కళారంగంలో

శ్రీమతి కె. రామలక్ష్మి

"అన్ని కష్టాలూ విడి, హాయిగా జీవితం గడిచి పోతుందనుకుంటూం టే, మళ్ళీ నాకీ పరీక్ష ఏమిటి?"

దీర్ఘంగా నిట్టూర్చింది కమల.

ఒక వ్యక్తికి సహాయం చేస్తే యిదా చివరికి జరిగేది? ఫలితం లభించేది? నృత్య నాటకం ఎంత అభాసయింది! అయినా తనకుండవలసింది ఆ బుద్ధి. హుఁ! చేతులు కాలాక ఆకులు పట్టుకున్నట్టు, అసలా రంగాచారి మాటలు విని దిగింది తను. లేకుంటే యీ గొడవంతా ఎందుకొస్తుంది?

గత సాయంత్రం రంగస్థలంమీద జరిగిన అవమానానికి కృంగిపోతూ వాలుకుర్చీలో పడుకుని, ఆలోచనల పొగలు, సెగలతో కమల హృదయం పొడారిపోతూంది. మహిళామండలి ఆధ్వర్యంక్రింద జరిగిన వార్షికోత్సవ సందర్భంలో బాలబాలికలందరినీ కూడదీసి నృత్య నాటిక వేయించింది. అది అయ్యవారిని చేయబోతే కోతి అయింది. పల్లెటూరి

మొద్దులు అనుకుంది కమల. నాట్యం అంటే ఏమిటో మరిచిపోయారు, సున్నితత్వం అంటే ఏమిటో అర్థమే తెలియదు వీళ్ళకి – లేకుంటే అంత సుకుమారమైన "వాసవదత్త" నాటికచూసి, హాస్య నాటికలో ముఖ్య విదూషకుణ్ణి చూసినట్లు అలా నవ్వేరేమిటి ? పిచ్చివాళ్ళు !

ఇదంతా రంగాచారి మూలంగానే, రానీ చెప్తాననుకుంది. చేతిలో పత్రిక మీదికి దృష్టి మరల్చింది. అన్నీ సినిమా బొమ్మలే! అలాటి విగ్రహం ఏ ఒక్కటీ నిత్య జీవితంలో కనిపించదు కదా అనుకుంది.

"ఏం కమలా, అంత దీర్ఘంగా ఆలోచిస్తున్నావు? మళ్ళీ ఏదైనా నాటకం ..."

"ఛా వేళాకోళం అది!" అంటూ రంగాచారి మాటల్ని మధ్య లోనే ఆపేసింది కమల.

"అదేమిటి కమలా ? అసలు పబ్లిక్ రంగంలో రాణించటానికి ముందు యిలాంటి డక్కా మొక్కీ లెన్ని తినాలో తెలుసా ?"

"చాల్చాలు ! ఈ అనుభవం చాలక యింకా తలపెట్టాలీ ?" చిన్నగా నిట్టూర్చింది కమల.

"కమలా, అలా నిస్పృహ చెందకూడదు. నీకీ రంగంలో యింత అభిరుచి వుందని నాకు తెలియదు సుమా ! నేనో మాట చెప్తాను. వింటావా ?" అనునయం ధ్వనిస్తూ అడిగాడు రంగాచారి.

"ఒద్దుబాబూ, నాకేం చెప్పవద్దు ! నన్నిలా కథలూ గట్రా రాసుకుంటూ బతకనీ. అనవసరంగా నాముందు పంచరంగుల ఇంద్ర ధనువులు ఎందుకు సృష్టిస్తావు ?"

"ఇంద్రధనుస్సు అబద్ధంకాదు కమలా ! జీవితంలో మట్టుకు అది అబద్ధమవుతుందని అనుకోవడం దేనికి ? ఈ చిన్న ఊళ్ళోగనక ప్రేక్షకులిలా బెడిసికొట్టారు. అదే ఏ పట్నంలోనైనా అయితే..."

"నీ మొగం, అసలు మొదటి రెండువరుసలు కూడా నిండేవారు కాదేమో !" అంది, చిన్న వేళాకోళం ధ్వనిస్తూ కమల.

"అలా అనకు కమలా! నీలో నిబిడీకృతంగా వున్న కళానిధులు నీ కెలా తెలుస్తాయి? తరివిణి పెట్టని వజ్రంలాంటి దానివి నువ్వు. నీ బాధ్యత నేను వహిస్తానుగా, కమలా! నువ్వు సరే అను చాలు. ఓ పంచవర్ష ప్రణాళిక రెడీ చేసేస్తాను" నవ్వుతూ అన్నాడు రంగాచారి.

"ఉదాహరణకి కొంచెం చెప్పు!" అంది, అదే వేళాకోళపు ధ్వనితో.

"పట్నం వెళ్ళిపోదాం. అక్కడ నీ కెంతటి భవిష్యత్తు ఉందో ఆరుమాసాలు కష్టపడితే తెలిసిపోతుంది."

మొదటు చిన్నగా నవ్వి, గట్టిగా నవ్వేసింది కమల.

"ఓ పిచ్చి రంగాచారీ! ఇక్కడ నాకుజరిగిన పరాభవం చాల కనా, చెన్నపట్నందాకా తీసుకెడుతున్నావు?" అంతట్లోనే కంఠస్వరం మార్చేస్తూ, "చూడు రంగాచారీ, అనవసరంగా నాకు కోపం తెప్పించకు. అసహ్యం కలిగించకు. ఈ చిన్ని జీవితంలో నేనెంతో అవమానం భరించాను. ఇక భరించలేను. నన్ను క్షమించి నువ్వు వెళ్ళిపో! మళ్ళీ నాకు కవిపించకు!"

"నువ్వేదో మనస్సులో బాధపడుతున్నావు కమలా. నేను రెండు మూడురోజులు పోయాక వస్తాను. అప్పుడు మాట్లాడుకుందాం," అని రంగాచారి వెళ్ళిపోయాడు.

కుర్చీలో తిరిగి జేరబడింది కమల. ఆకాశంలో శూన్యం మధ్య అన్ని నక్షత్రాలు మెరుస్తాయి. జీవితంలో శూన్యం మధ్య యింకే చిన్న మొరుపులూ రాణించవు కాబోలు! కాలేజీలో చదువుకొనే రోజుల్లో కట్టిన గాలి మేడలేమయ్యాయి? ఊహల విషచక్రాన్ని తెంచుకు బయటు పడ్డానికా అన్నట్టు చేతిలో వున్న పత్రిక విప్పింది. దాన్నిండా సినిమా బొమ్మలు. వాటిని చూస్తుంటే రంగాచారి రుచి చూపిస్తానన్న భవిష్యత్తు యిదేనా అనిపించింది. అనుకోకుండానే సినిమాలను గురించీ, వాటిలో తన భవిష్యత్తు గురించీ ఆలోచించడం మొదలెట్టింది కమల.

ఏమో, ఎవరు చూడొచ్చారు! తనకు అదృష్టముంటే రాణించ

వచ్చు. అనవసరంగా రంగాచారిని నొప్పించానే అనుకుంది. రంగాచారి తిరిగివస్తే బాగుండు ననుకొంది.

మాటలోనే వచ్చాడు రంగాచారి. అసలు అతనెక్కడికేనా వెళ్ళితేగా! క్రిందికి వెళ్ళి బాతాఖానీలో పడ్డాడు. ఓ రెండుగంటలు దాటిందికదా, కమల మూడ్స్ మారి వుండకపోతాయా — అనుకుని మెట్లెక్కి వచ్చాడు. అతని ముఖం చూస్తే నవ్వొచ్చింది కమలకి. చిన్నబుచ్చుకున్న కుర్రవాడిలా, మెల్లగా మెట్లెక్కివచ్చాడు రంగాచారి.

"రా! ఏం అంత బితుకు బితుకుమంటూ వస్తున్నావు?" నవ్వుతూ ఆహ్వానించింది. కమలలో వచ్చిన మార్పుకి ఆనందంతో వికసించింది రంగాచారి ముఖం. అతని కళ్ళలో పచ్చని భవిష్యత్తు తొంగిచూసింది. అదెవరిదో మట్టుకు దురూహ్యం. తరవాత రెండుగంటలసేపు అలసట లేకుండా ప్లాన్లు చర్చించాడు రంగాచారి. మద్రాసు వెళ్ళిపోవడానికి నిర్ణయాలు జరిగాయి. ప్రయాణానికి తేదీ నిశ్చయమయింది. ఎంతో ఉత్సాహంతో వెళ్ళిపోయాడు రంగాచారి.

ఊహల గుర్రాలకు కళ్ళేలు బిగించలేక నీరసంగా కూర్చుండి పోయింది కమల. ఆ క్షణంలో కమల మెదడులో స్తబ్దత ఆవరించింది. హృదయంలో ఏ విధమైన ఆరాటం లేదు.

* * *

కమల మద్రాసు వచ్చేసింది. వచ్చి వారాలూ నెలలూ గడచి పోతున్నాయి. కాళ్లరిగేలా తిప్పుతున్నాడు రంగాచారి. ఎక్కడికి? స్టూడియోలకి. దర్శకుల దర్శనానికి ప్రొడ్యూసర్ల ప్రాపుకోసం. ఏమైతేనేం, అంతటా నిరాశనిండింది. కమల తన క్షణికమైన బలహీనతకి నొచ్చుకుంది. రంగాచారి ఆనాడు అప్పుడేవచ్చి యుండకపోతే! ఏంలాభం? నిరాశ ఏర్పడ్డా, కమలలో ఓ విధమైన మొండితనం ఆవేశించింది. ఏం తనంత చేతకానిదా – అన్న ఉక్రోషం ఎక్కువైంది. దీని ఫలితంగానే, ఏ ఒక్క కళారంగమైనా తనకి ఆశ్రయం యివ్వకుండా పోతుందా – అని ప్రయత్నాలు సాగించింది. రేడియోలో

తన కంఠం పనికిరాలేదు. కవిగారు సంభాషణల ఉచ్చారణ బాగు లేదన్నారు. "కొన్ని కోణాల్లో ఘోరంగా వుంది నీ ముఖం," అన్నారు దర్శకులు. విషాదంగా నవ్వుకుంది కమల. అన్నీ నన్నుకాదనుకుని మళ్లీ ప్రయత్నాలు ప్రారంభించింది.

కాలం గడుస్తున్నకొద్దీ కొండలు పిండవుతాయన్నట్లు, కూర్చుని తింటూ వుంటే తలుపులూ ద్వారబంధాలు కూడా కరిగిపోతాయి. ఎలాగైనా సంపాదిస్తే తప్ప కాలం గడవని పరిస్థితిలో ఒక సంగీత నృత్య సంస్థలో జీతంమీద చేరింది. చిన్న చిన్న వేషాలు, వంతపాటలు. తను కోరిందిదేనా అని అప్పుడప్పుడు అనిపించినా, చేసేది ఇంకేం లేక దానితోనే తృప్తిపడింది కమల.

కొన్ని మాసాల అనుభవం తరవాత కమలకి ఒక నృత్య నాటికలో పెద్ద వేషం లభించింది. అదే కమల గీత మళ్లించింది. కమలతోపాటు అదే నాటకంలో ఇంకో ప్రముఖ నర్తకి, రసికురాలు పాల్గొంది. ఈమెకోసం కళారంగా లన్నిటినుండీ ప్రముఖు లందర్నీ పిలిపించేశారు.

చెన్నపట్నం వచ్చాక, వ్యక్తులముందు తన ప్రతిభ చూప యత్నించిందేగాని, ప్రేక్షకులముందెన్నడూ నిలబడలేదు కమల. ఇదే మొదటిసారి నిండుసభలో నిలవడానికి. కమలకి భయంపుట్టుకొచ్చింది. తెర తీస్తారంటే నీరసం వచ్చినంతపని అయింది. ఏదో రోటిలో తల దూర్చి రోకటిపోటుకు జడిసినట్లు, యిప్పుడు భయపడి లాభం ఏమిటి? ఆపద మొక్కులవాడు తిరుపతి వెంకన్నమీద భారంవేసి, గుండెధైర్యం చిక్కపట్టుకుంది. సభానందనంచేస్తూనే, జయంచేకూరితే తిరుపతి వస్తానని మొక్కుకుంది.

నాటకం జరుగుతూంటే ముందువరసలోని పెద్దల్ని తిలకించింది కమల. ఇదివరలో తను చూసినవాళ్లు చాలామంది వున్నారు. స్వరశుద్ధిలేదన్న సంగీత దర్శకుడు, ఉచ్చారణ బాగు లేదన్న కవిగారు. తదితరు లనేకమంది అక్కడ కనిపించేసరికి పౌరుషం వచ్చింది కమలకి. మైమరచి నటించింది. ఏక బిగిని కరతాళధ్వనులు వినిపిస్తున్నాయి.

అందరూ ఏమేమిటో గోలగా మాట్లాడు కుంటున్నారు. తనెక్కడున్నదీ కూడ తెలియలేదు కమలకి.

కళ్లు తెరచి చూచేసరికి రంగాచారి సపర్యలు చేస్తున్నాడు. అతని ముఖం ఉత్సాహంతో నిండి వుంది. "ఏం కమలా!" అంటూ ఎక్కడలేని ఆప్యాయత ధ్వనించాడు పిలుపులో. కమలకి ఆశ్చర్యం వేసింది. డబ్బు తగినంత లేక తనెందుకూ పనికి రాకుండా పోతే విసుక్కున్న రంగాచారేనా యితను – అనుకుంది.

"ఏమయింది ?" అని అడిగింది.

తెరపడే ముందే మైకం వచ్చి పడిపోయావు. నీ అభినయానికి అందరూ స్తబ్ధులైపోయారనుకో. అబ్బ! నా కళ్ళని నేనే నమ్మలేక పోయాను కమలా!" అంటూ ఆప్యాయంగా చేయి నిమిరాడు రంగాచారి. కోరిక తీరిన క్షణంలో ఎలా వుంటుందో ఊహించుకో గలిగింది కమల. ఇక ఫర్వాలేదన్న ధైర్యం వచ్చింది.

కొద్ది వారాల్లోనే కమల భాగ్యరేఖా పథంలో ప్రయాణం కట్టింది. ఇదివరకు ముఖం చూడని దర్శకులు కార్లు పంపుతున్నారు. సంగీతం విని తీరాలని పట్టుపడుతున్నారు గాయకులు. రంగాచారి అన్నిటా కుడిభుజంగా వుంటూ కార్యక్రమాలు సరిదిద్దుకుంటూ వస్తున్నాడు.

పసిడిరెక్కలు పరుచుకుని కాలం పరుగెత్తిపోతోంది. అది వ్యధిత హృదయాలకోసం ఆగదు. ఉత్సాహాల కోర్కెలు సాధించ డానికీ ఆగదు. ఐశ్వర్య దారిద్ర్యాల చక్రాన్ని తిప్పుకుంటూ ముందుకు సాగిపోతుంది. కమల తల్లిదండ్రులు పట్నంలో కాపురం పెట్టారు. చుట్టుపక్కాల రద్దీ ఎక్కువైంది. ఆర్థికంగా బాగుంటే ఆంధ్రకుటుంబం అంతే కదూ.

డబ్బు కొనగల్గే సౌఖ్యాలు, సౌకర్యాలు మానసికమైన కోర్కెల్ని తీర్చలేవు. మనస్సుకి విశ్రాంతినియ్యవు. కమల అంతే అయింది. జీవితంలో ఓ దుర్ముహూర్తాన అడుగుపెట్టింది కాబోలు, తొలినుండి తుదివరకు ఒకటే ఆరాటం, ఆవేదన.

ఇంట్లో డబ్బురంధి తప్పింది. నాన్నకీ అమ్మకీ యింకో గొడవ లేదు. కళాప్రపంచంలో శీలానికీ సౌశీల్యానికీ విలువలేదు – ఇవీ, ఒక సంవత్సరం జరిగేలోపున కమల తెలుసుకున్న వేద రహస్యాలు. స్టూడియోల్లో మనుష్యుల కింతప్రవర్తన, ఆర్కెస్ట్రాలో వాద్యగాళ్ళ అర్థంలేని వాగుడు – అన్నీ విని విని విసిగిపోయింది కమల. స్నేహం ఎక్కడా లభించదు కాబోలు అని పరితపించింది కమల హృదయం.

అందం, వయస్సు ఉన్న కమల అందరి దృష్టినీ ఆకర్షించింది. దానితోనే ప్రారంభమయింది ఆమెలో సంక్షోభం. మంచిమాట, మంచి హృదయం కరువయ్యాయని బాధపడ్డ కమలకి ఒక్క శాస్త్రి కనిపించాడు. శాస్త్రి కవి. సహృదయుడు. మితభాషి. అతనెంత మితభాషో కలం అంత చురుకు. ఆర్కెస్ట్రాతో గంట కూర్చుంటే హృదయం కదిలించే విషాద గీతిక రూపొందించగలడు. మాటల కందని ప్రేమని పాటలో నింపగలడు.

కాని ఏమిటీశాస్త్రి – అనుకున్నది కమల. ఆడవాళ్లంటే ఉదాసీనంగా ప్రవర్తించే శాస్త్రి పట్ల కమల హృదయం ఆవ్యాయతతో నిండిపోయేది. కాని శాస్త్రి ఎప్పుడూ పలకరించిన పాపాన పోలేదు. కొద్ది రోజులుగా అతని సాన్నిహిత్యంకోసం తహతహ లాడింది కమల హృదయం. అంతకంతకు అతను దూరం అయాడు. విధి! ప్రేమించే హృదయానికి తిరస్కారం! మూగగా బాధపడుతున్న ఆమెకు యింటిలోపోరు భరించరానిదయింది ఏమిటీపెద్దలు! తనని వ్యక్తిగా చూడ్డం మానేసిన నాన్న, తననో అందాల బొమ్మగా మాత్రమే చూస్తున్న అమ్మ—ఎలాగ వీళ్ళమధ్య జీవితాంతం బ్రతకడం? తననో యంత్రంగా చేసింది ఈ యింటి వాతావరణం. బంగారు గుడ్లుపెట్టే బాతూ – రైతు కథ జ్ఞాపకానికి వచ్చి నవ్వుకుంది.

ఈ చిగురించని వాతావరణంలో సజీవంగా ఉండడం దుర్లభమని యెంచే కమల హృదయం కొత్త సాన్నిహిత్యంకోసం, తలపుల కోసం ఉద్రూత లూగింది. తన గుండెలదడ శాస్త్రిని పిలుస్తూన్నట్లు, తన అడుగుల సవ్వడి శాస్త్రి రాక లాగ ఊహించుకుంటూ పగటికలలు

కన్నది కమల. అవి పగటి కలలుగానే ఉండిపోతాయేమోనని భయ పడింది. తనతో మాట్లాడే ధోరణినిబట్టి, శాస్త్రి వట్టి హృదయం లేని వాడు కాదని తెల్చుకుంది. అదే ఎంతో తృప్తినిచ్చింది కమలకి. "మా యింటికి రండి, కాఫీ తాగి వెడుదురుగాని," అని భయపడుతూనే పిలిస్తే, చిన్నగా నవ్వుతూ "ఇప్పుడు కాదు" అన్నాడు శాస్త్రి తాను నవ్వుతూనే "మరెప్పుడు?" అని అడిగింది ఎంతో ఆప్యాయంగా తన చేతిని అతని చేతిలోకి తీసుకుంటూ, "కమలా, ఈ ప్రపంచంలో నీలాంటి అమాయకులని చూశాను. బాధపడ్డాను. నిన్నొక యంత్రంగా మాత్రమే చూచే నీ తల్లి దండ్రులు నీకూ ఒక సంసారం ఉండాలని తలపోయరు. వారికి నీ సంపాదన కావాలి. దాని మీద అధికృతిని వాళ్ళంత సులభంగా ఒదులుకోరు. కమలా, ఆలోచించి చూడు. హృదయానికి అనవసరంగా దెబ్బ తగుల్చుకోకు" అంటుంటే కళ్ళ నీళ్ళ బొటబొట రాల్చింది కమల... ఇ తేనా?

ఇంటికి వచ్చాక మాటలధోరణిలో సొంతఘోష బయట పెట్టింది. మనకి తగ్గవాడు దొరికితే యిల్లరికానికి తెచ్చుకుందాం అన్నట్లు ధీమాగా మాట్లాడిన తండ్రినీ, అవునవునంటూ తలవూపిన తల్లినీ చూచి అసహ్యించుకుంది.

దీనికో దారి చూడాలి. తన మానసిక దౌర్బల్యాలు తిరిగి రెచ్చి పోకుండానే తనో దారి చూసుకోవాలి. ఈ క్షణాన శాస్త్రి దగ్గరవుంటే బాగుండుననిపించింది కమలకు. కాని శాస్త్రి దగ్గరలెడు. ఉన్నా తనపట్ల, తన అసహాయస్థితిపట్ల అతను సుముఖుడూ కాదు. కాని... కాని... ఏమిటిది? అందని అందాలకోసం అర్రులు జాస్తుంది మానవ హృదయం. అది దానికి అసహజం అనిపించదు.



# 7. పరిష్కృతి

శ్రీమతి పి. సరళాదేవి

రేడియో స్టేషనులో ప్రోగ్రాం ముగించుకుని బయటకు వచ్చింది కమల. జీవితంలో బలంగా దెబ్బతిని కోలుకోలేని ఆక్రోశంతో, ఏదీ గమనించలేని స్థితిలో తలవంచుకుని రోడ్డుమీదకి వచ్చింది.

దారికడ్డంగా టాక్సీ.

తలెత్తింది.

తలుపుపట్టుకొని శాస్త్రి.

"ఎక్కు, బీచికి వెళ్దాం," అన్నాడు.

ఏమీ అడగాలని బుద్ధిపుట్టలేదు కమలకు. ఏమిటయితే తనకేమి సంబంధం అన్నట్లుగా ఎక్కికూచుంది మనసు, మనిషి అంతా స్తబ్దుగా వుంది. బుద్ధి చచ్చిపోయింది.

పదిహేను రోజుల నుండి ప్రస్టవేసిన మామయ్య వారంరోజుల క్రితం ఆదుర్దాగా వచ్చి, మొదటు ఎదురైన కమలతో :

"రామచంద్రుడిక్కడే వున్నాడు కమలా! వాణ్ణి తెలీదూ? మీ నాన్నకు తెలుసులే. మన జిలావాడే. నిన్ను తెలుసునట. నీ పాటనూ, నిన్నూ ఆకాశాని కెత్తేస్తున్నాడు. ఒక్కడే కొడుకు. వాడి తండ్రి తులాభారం తూగాడు తెలుసా? ఇక్కడికి సినిమా తీద్దామని వచ్చాడుట రేపు మనింటికి వస్తాడులే చూద్దువుగాని. నిజంగా రామచంద్రుడే అనుకో!" అన్నాడు.

కమల మాటాడకుండా గదిలోకి వెళ్లిపోయింది. అర్ధరాత్రి వరకూ నాన్న, మామయ్య రామచంద్రం గురించి మాటాడుకోవడం వింది. ఈ చర్చలన్నీ ఎందుకోకూడా తెలుసు. ఎందుకు వీళ్ళకి తాపత్రయం? తననిగురించి అన్నీ వదిలేసినవాళ్ళు తననిమాత్రం ఎందుకు వదలరు?

"నేను పెళ్లి చేసుకుంటా నాన్నా!" అంది తనొకరోజు, తన అవసరాలను యింట్లో వరూ గమని చకపోడంతో తిక్కరేగి. నాన్న హడలిపోయి, "మంచి వరుడు దొరకగానే మా చేతుల తోనే చేస్తామమ్మా! కూతురూ అల్లుడూ కల కల లాడుతూ తిరగాలని ఏ తండ్రి కుండదు చెప్పు!" అన్నారు.

తనని కూతుర్లా చూస్తున్నారా? డబ్బు సంపాదించే మగవాడికి అధికారమన్నా వుంటుంది. డబ్బు సంపాదిస్తున్న తనకు అదీలేదు. తన ప్రమేయంలేకుండా ఏమన్నా జరుగుతాయి ఈ యింట్లో తన డబ్బుతప్ప తను అక్కర్లేదు. తనులేకపోతే డబ్బురాదుకాబట్టి ఇల్లరికపు టల్లుడికోసం అన్వేషణ. ఎవడొస్తాడు పిచ్చివాడుతప్ప? తనూరుకుంటోందని యిష్టమొచ్చిన వేషాలేస్తున్నారు. ఏమిటో! గాలెలావీస్తే అలా పోతూందేతప్ప ఏమిటి తను సాధించి ది? చాలసేపటివరకూ నిద్రపట్టలేదు కమలకు. మర్నాడు సాయంత్రం కమల యింటికొచ్చేసరికి మామయ్య రామచంద్రునితో ప్రత్యక్షం! కమల మర్యాదగా మాటాడింది. రామచంద్రుడు మాత్రం స్టూడియో విషయాలు, తను

తీయదలచుకున్న సినిమా విషయాలు ఏకబిగిని మాటాడేసి, కమలని పొగిడేశాడు. తనుతెచ్చిన వరుడి గొప్పతనంగూర్చి తను ఊరుకోడం చూసి, అమ్మా నాన్న పొంగిపోయారు.

అంతే. మర్నాటి నుంచీ స్టూడియోలో ప్రతివాళ్ళూ అడగడమే, ఫుడ్ బీ డైరెక్టరు రామచంద్రుణ్ణి చేసుకోబోతున్నావా ? అని. కమల ఆశ్చర్యపడిపోయింది. ఇంటికొస్తే అమ్మా నాన్నా అపురూపంగా చూస్తున్నారు. మామయ్య మీసం మెలేస్తున్నాడు. తన ఉద్దేశం ఎవరికీ అక్కర్లేదా ? ఒళ్లు మండింది కమలకి.

"ఇల్లరికం అని చెప్పేవా ?" అంది మామయ్యను దుడుకుగా, ఎలా కదపాలో అర్థంకాక.

"అన్నీ మాటాడే నమ్మాయీ. నేనే దయినా చేస్తే చీపురుపుల్ల ఎత్తి చూపించడానికి వీల్లేకుండా చేస్తాననుకో. నా సంగతి నీకు తెలియదు మీ నాన్న నడుగు. వ్యవహారాలుచేయడంలో నా అంతటి వాణ్ణి నేనే. పెద్దవాణ్ణి చెబుతున్నా విను. రామచంద్రుడు మంచివాడు. నువ్వు కళ్ళ కద్దుకున్నావా నీయెత్తు బంగారం పోస్తాడు. వచ్చే మాసంలో ఓ ముహూర్తం కూడా వుంది. ఇంక మేం కనిపిస్తామటులే అమ్మాయి గారికి !" అన్నాడు.

ఏమనడానికి తోచలేదు. అయోమయంగా చూసింది. బుర్రంతా గిర్రున తిరిగి పోతోంటే గదిలోకెళ్ళి కూర్చుంది కమల కొన్ని గంటల కాలం. ఏడుపురాలేదు. కడుపులో వేడన. పేగులు నులిపెట్టే బాధ. కసి. ఎవరినో హింసిద్దామన్న ప్రేరణ. ఎంత చల్లని నిషాలు ! ఇదా వీళ్ళు చేసే ఉపకారం ? తన పెళ్ళికి కూడా తన ప్రమేయం లేదు. ఏం దారి ? ఏం చెయ్యడం ?

కమలను దిగులు ఆవరించింది. ఎక్కడో భూమిలోకి కూరుకు పోతున్నంతదిగులు. మనిషి క్రుంగిపోయింది. ఈ చీకట్లో వెలుగెక్కడ? గుడ్డిదై పోయిన తనకు తోవ చూపేవారెవరు ? అడుగడుక్కీ తడుముకుంటూ పడిపోతూ నశించిపోవడమేనా తనగమ్యం ?

మత్తుగా ఏదో లోకంలో తిరిగేస్తున్న కమలను శాస్త్రి బీచికి తీసుకు వెళ్తున్నాడు.

బీచిలో దిగి, కారుపంపించేసి, కమలను చేయిపట్టుకు తీసుకు వెళ్లి, ఒక దగ్గర కూచో పెట్టి తనూ కూచున్నాడు శాస్త్రి. కమల శూన్యంగా, సముద్రంవేపు చూస్తూ కూచుంది. శాస్త్రి కేమీ బోధ పడలేదు సూటిగా మొదలు పెట్టాడు.

"రామచంద్రుణ్ణి చేసుకోవాలను కొంటున్నావుట నిజమేనా ?"

"ఊఁ" అంది చలనరహితంగా కమల.

"ఎందువల్ల ?" శాస్త్రిప్రశ్న.

కమల జవాబివ్వలేదు.

"డబ్బుందనా ? మనిషి బావుంటాడనా ? ఇల్లరికం వస్తాడనా?"

జవాబుల్లేవు.

"అతనెంత చెడిపోయాడో,ఎటువంటివాళ్ళతో తిరుగుతున్నాడో తెలిసేనా ? అతనికో పల్లెటూరి భార్య వుందని, ఆవిడని వొదిలేసి నిన్ను చేసుకోవాలనుకుంటున్నాడని తెలిసేనా ?"

జవాబుల్లేవు.

ఇవన్నీ యిప్పుడే వింటున్న కొత్త విషయాలయినా, కమలకు ఆశ్చర్యంగాని, ఆసక్తిగాని కలగలేదు. రేడియో వార్తలు వింటున్నట్టుగా వుంది.

ఈవిడ వాలకం చూసి వొళ్ళు మండింది శాస్త్రికి. తమాయించు కోలేకపోయాడు.

"వాడంటే నువ్వెంత మోజుపడుతున్నావని తెలిస్తే..."

"ఛీ !" అంది కమల, పిడుగుపడ్డట్టుగా. ఆ స్వరానికి అదిరి పోయాడు శాస్త్రి. కమల మొహంచూశాడు ఏడుస్తోంది. చెంగులో మొహం దాచుకుని వెక్కి వెక్కి ఏడుస్తోంది. ఇన్నాళ్ళనుండి దాగొన్న దుఃఖం, తన నర్థంచేసుకునే వ్యక్తి కనిపించేసరికి కట్టలు తెంచుకుంది. కొంత సేపటికి సంబాళించుకొని, అంతా చెప్పింది కమల. ఇదే కాదు

తన జీవితం అంతా చెప్పింది. చెప్పి, "నా కెవ్వరూ లేరు. జీవితం నాకు చాలా అన్యాయం చేసింది. తోబుట్టువులనుండి, తల్లి తండ్రి నుండి సహజంగా సంక్రమించవలసిన వేవీ నాకు అందలేదు. స్నేహితులూ లేరు చివరిగా...మనసిచ్చి మాటాడే భర్తకూడా దొరికే అవకాశం పోయింది. నావల్ల అందరూ ఉపకారాలు పొందారుకాని, నాకు ఉపకారం చేసేవాళ్ళు కరువయారు. ఇంక నే నెలా పోతేనేం? చూసి చూసి చివరికి ఏదో సాహసం చేసేస్తాను" అంది.

శాస్త్రి కమలభుజంమీద చెయ్యివేసి, "అలా ఆవేశపడకు కమలా!" అని కమల కళ్ళలోకి చూస్తూ, "పద! మీ ఇంటికి వెళ్ళి నాన్నగారితో మాట్లాడదాం. వాళ్ళమ్మాయి ఆదాయం వాళ్ళకే పంపే పద్ధతిమీద నేను ఆ ఇంటికి అల్లుడిగా వచ్చే యోగ్యత ఉందేమో అడుగుతాను" అన్నాడు.

కమల వెర్రిగా చూసింది. ఆవేశం పట్టలేక, అతని కుడిచేతిని రెండుచేతులతో పట్టుకొని ముద్దెట్టుకుంది.

అరగంట వరకు మాటరాక, గుండెల్లోంచి ఆనందం తన్నుకొస్తూంటే, గుక్కిళ్ళు మింగుతూ కూర్చుంది. బుద్ధి పనిచేయడం లేదు. ఎంతోసేపటికిగాని చెప్పలేకపోయింది తన ఉద్దేశాన్ని.

"రిజిష్టర్డు మారేజి అయిపోయాకగాని ఎవరికీ చెప్పొద్దు!" అంది.

భయం...గట్టిగా మాట్లాడితే ఏ గ్రహాలు విని శాస్త్రిని తనకు కాకుండా చేస్తాయేమోనని.

టాక్సీలో ఇంటివరకూ దిగపెట్టాడు శాస్త్రి. భోజనం చేసిందో లేదో తెలియదు కమలకు. ఆ రాత్రి యింక నిద్రపట్టలేదు. ఇంత సంతోషం భరించలేకుండా వుంది. ఈ సంతోషంతో గుండెపగిలి చచ్చిపోదుకదా! పగలపడి నవ్వేలాచేస్తే బాగుండును తనని ఎవరైనా.

నెలరోజుల క్రిందట ఇంత సంతోషమూ పొందినరోజు జ్ఞాపకం వచ్చింది కమలకు. సినీ అభిమానుల సంఘం జరుపుతున్న సాంస్కృతికోత్సవాలలో అద్భుతంగా పాడింది తను. అందుకోసమై శాస్త్రి ప్రత్యేకంగా పాటలు రాసి తరిఫీదిప్పించాడు. తను విషాదగీతాలు

చాలా బాగా పాడుతుందని అందరూ అనేవారు. 'మీకు విషాద మంటే ఇష్టమా?' అని అడిగేవారు. ఏం చెబుతుంది తను? 'ఇష్టమే' ననేది. ఆరోజు తన పాట తనకే ఆశ్చర్యం కలిగించేవరకు అందరూ ఎందు కలా అడిగేవారో అర్థం కాలేదు. అసలు తన గొంతుకన్నా శాస్త్రి పాటలు – ముఖ్యంగా ఆపాట–ఎంతబాగుందని. అతని జన్మలో మళ్లా రాయగలడా అంత గొప్పది?

చకోరపక్షి, ఆహారం కోసం వెళ్లిన తన ప్రియుడు ఎంతకీ తిరిగి రాకపోవడం చూచి, పడిన ఆవేదన ... అంత సముద్రంలోనూ ఏమూలయినా తన పక్షి ఎగురుతూ వస్తున్న నీడ పడుతుందేమోనని ఆ చీకటిరాత్రిలో కళ్లు దీపాలుగా చేసి, ఆ వెలుగులో హృదయాన్ని కళ్ళుగా చేసి వెతుకుతోందిట. తన పిలుపుకు ప్రతిపిలుపు వస్తుం దేమోనని ప్రాణంతో వొళ్ళంతా చెవులు చేసుకుందట. తన పక్షి దారి తప్పిపోకుండా వచ్చేందుకై ఒకే ఒక చల్లని కిరణం ప్రసాదించి వెలుగునిస్తే, వచ్చే జన్మలో తనే ఒక కిరణమై నీలో కలుస్తానని చంద మామను వేడుకొంటూందిట.

పాడుతూంటే ఒళ్ళంతా కదిలిపోయి కళ్ళలో నీళ్ళు తిరిగాయి. గుండెలు కోసి, రాసినవాడికి నైవేద్యం పెట్టాలనిపించింది. దుఃఖంతో గొంతు కట్టుబడిపోయే సమయానికి పాట పూర్తయింది. మత్తులోంచి బయటపడిన ఉత్సాహంతో కరతాళ ధ్వనులు మోగిపోయాయి. ప్రతి మాలి మళ్ళా పాడించుకున్నారు. ఆ సమయంలో శాస్త్రి కళ్లు ఎంత తళతళలాడాయి! ఆప్యాయంగా తన నెలా స్పృశించాయి! ఆనందంతో తన నెలా ప్రశ్నించాయి! తనజీవితంలో అంత గొప్పరోజు మళ్ళారాదేమో ననుకొంది.

నెలరోజులు తిరగకముందే అంతకంటె వెయింతల మంచిరోజు, వెనుతిరగని అదృష్టం వస్తుందనుకుందా? ఊరికే కన్నీళ్ళు వచ్చే స్తున్నాయి కమలకు. ఆ నీళ్ళతో తలగడా తడిపేసి, తెల్లవారు ఝామున నిద్రలో పడింది, మధురమైన కలల నాహ్వానిస్తూ.

ప్రొద్దున్నే కమల గదిలోంచి. కూనిరాగం వస్తోంది. ఇంట్లో

అందరూ ఒకరి మొగా లొకరు చూసుకున్నారు. కమల మొగాన్ని చూసి మరింత ఆశ్చర్యపోయారు అంత ఉజ్వలంగా వెలుగుతున్న మొహాన్ని కాలేజీ వదిలేశాక చూడలేదు. ఆ అలసటగాని, బరువుగాని లేకుండా, అప్పుడే విచ్చుకున్న పువ్వులా కలకలలాడుతోంది కమల.

కమల వెళ్తూ చెప్పింది: "అమ్మా, నేను మధ్యాహ్నం భోజనానికి రాను. స్నేహితులతో గడుపుతాను" అని. తల్లి పులకించిపోయింది. నోరారా కమల అలా పిలిచి ఎన్నాళ్ళో అయింది. రెండు రోజుల క్రిందటే వచ్చిన అక్క ఓసారి పలకరించేసి వెళ్లిపోయింది.

మారేజి అప్లికేషను ఫారంమీద సంతకం పెట్టాక, కమల ఏ లోకంలో వుందో తెలియదు. రాత్రి వచ్చి భోజనం చేస్తూంటే, మామయ్య హడావిడిగా వచ్చి "బీచిలో ఎవరితోనో మా కుషీగా తిరిగేస్తున్నావే!" అన్నాడు నిందార్థ్హంగా.

"అతని పేరు శాస్త్రి. ఓ కవిలే మామయ్యా. నా స్నేహితుడు కూడాను." నవ్వుతూ అనేసి, పెరుగూ అన్నం నోట్లో పెట్టుకుంది కమల. గుండె ఆగినట్టయింది మామయ్యకు. ఇంత కులాసాగా, స్పష్టంగా కమల అతనితో మాటాడింది లేదు. రెండు రోజులతర్వాత మామయ్య వార్తలవల్ల తల్లి అడిగింది కమలని. "ఎవరే అమ్మాయీ? ఎవరో అతనితో ఊరికే తిరుగుతున్నావట!" అని.

"ఏం మునిగిపోలేదులే అమ్మా!" అని తేలిగ్గా తీసిపారేసింది కమల.

"అది కాదే! రేపో నేడో పెళ్ళికావలసినదానవు. ఆ కాబోయేవాడు ఏమనుకుంటాడు చెప్పు," అంది. కమల తన చేతుల్లోంచి దాటిపోతుందేమోననిపించింది ఆవిడకు

"ఆ కాబోయేవాడి యిష్టంమీదే తిరుగుతున్నానే!" అనేసి, గభాల్న లేచిపోయింది అక్కణ్ణించి. అదేమిటో సరిగా అర్థం కాలేదు కమల తల్లికి. రోజులు క్షణాల్లా గడుస్తున్నాయి. కమల తిరుగుళ్లు మామయ్య చేరేయడం, అమ్మా అక్కా మామయ్యా గుసగుసలు

పోవడం, నాన్నకి చెప్పడం, అమ్మా అక్కా తనని వేయి కళ్ళతో గమనిస్తూండడం — చూసీ చూడనట్టు గమనించింది కమల.

పట్నంవచ్చాక వాళ్ళ బలం తగ్గిపోయింది. వాళ్ళ చేతుల్లోంచి కొంచెం జారింది కమల. అందుకే, అక్కడ పిచ్చెక్కించిన వాళ్ళు, రక్ష రేకులు కట్టించి ప్రాణాచారాలు నడిపించినవాళ్ళు, యిక్కడ ఏమంటే ఏ ప్రమాదం వస్తుందోనని జంకుతున్నారు.

పెళ్ళి సంగతి రానురాను అందరికీ తెలిసిపోతోంది. పెళ్ళి మర్నాడనగా ఆ ముందురోజు కమల యింటికి వచ్చేసరికి యింట్లో అందరూ కూర్చుని మాటాడుకుంటున్నారు మామయ్య తెచ్చిన వార్తను గురించి. కమల గదిలోకి వెళ్ళబోతుంటే నాన్న పిలిచి "వార్త నిజమేనా ?" అని అడిగాడు.

"నిజమే నేనూ శాస్త్రీ రేపు పెళ్లి చేసుకోబోతున్నాం," అంది నిబ్బరంగా.

మామయ్య కందగడ్డలా మొహం చేసుకుని, "ఇలాంటి దేదో అవుతుందని నాకు తెలుసు. ఆడపిల్లనలా పెళ్ళి చేయకుండా విచ్చల విడిగా తిరగనిస్తే ఏమవుతుంది ? ఇంటావంటా లేని వేషాలు ... "

"నోరుతగ్గించు మామయ్యా" అంది కమల కఠినంగా మధ్యలోనే ఆపి. దాంతో మరికొంచెంరేగి, "మరి ఆ రామచంద్రుడి కేం చెప్ప మంటావు ?" అన్నాడు.

"నన్నడిగే అతన్నొప్పించేరా, ఇప్పుడు నే చెప్పడానికి ? నేనూ ఒక మనిషినేనని, నాకూ యిష్టా యిష్టా లున్నాయని తెలుసుకోకుండా, బొమ్మగా చేసి ఆడిస్తే, ఆ బొమ్మకూడా ఎప్పుడో చేతుల్లోంచి జారిపగిలి పోతుంది," అంది విసురుగా.

తల్లి వెంటనే దిగాలుపడిపోయి, "అయ్యో తల్లీ! అన్నాళ్ళు మోసి, యిన్నేళ్లు పెంచి, విద్యాబుద్ధులు చెప్పించి, కొండంత ఆశపెట్టు కుంటే... "

మధ్యలోనే కమల అందుకొని, "అందుకనే, యిన్నాళ్లూ మీరు చూపించిన దారిలో నడిచాను. ముళ్ళు గుచ్చుకున్నాయి. ఇప్పుడు నాకు నేనై మంచిదారి వెతుక్కున్నాను," అంది.

"అసలు దీన్ని చిన్నప్పటినుంచీ అదుపులో పెట్టక యిలా తయారైంది. మావారు అంత మొత్తుకొని చెబుతూంటేకూడా విన్నారు కాదు," అంది అంతవరకూ వింటూ కూర్చున్న అక్క దురుసుగా.

కమల ఆ మాటను లెక్కచేయలేదు. తండ్రిదగ్గరికు వచ్చి, "నాన్నా, రేపటివరకూ కూడా ఉండాలని లేదు. ఇవాళే శాస్త్రిదగ్గరకు వెళ్ళిపోతున్నాను. మీ రెక్కడున్నా నా ఆదాయమంతా మీకే పంపిస్తాను. ఇవన్నీ మాటాడేందుకు శాస్త్రి వస్తానన్నాడు. అతనికి బాధ్యత మరి లేదు. మీరు మనస్ఫూర్తిగా దీవించగలిగితే, రేపు పెళ్ళికి రండి," అనేసి గబగబా గదిలోకి వెళ్ళి, పెట్టె పెడ్డింగు బయటకు తెచ్చింది. అప్పుడే కమలకోసం శాస్త్రి టాక్సీలో వచ్చాడు. వెంటనే అందులో పెట్టేసి ఎక్కి కూచుని తండ్రివైపు చూసింది కమల.

ఆయన నిబ్బరంగా చూసి నిట్టూర్చాడు.

కారు కదిలింది.





# మనసు ఫౌండేషన్ పుస్తకాల పరిశీలనాపట్టిక

| | |
|---|---|
| పుస్తకం సంఖ్య | TPLA127B115 |
| పుస్తకం పేరు | సప్తపది |
| తారీఖు | 30/10/24 |
| ముందు అట్ట | NO |
| వెనుక అట్ట | NO |
| మొత్తం పేజీలు | 63 |
| పెద్ద సైజు పేజీలు | NO |
| ఖాళీ పేజీలు | 62 |
| లేని పేజీలు | NO |
| తయారు చేసినది | Aswini |
| పేజీలు విడదీసినది | Thasin |
| స్కాన్ చేసినది | S. Lakshmi |
| పరీక్ష చేసినది | HASEEMA |
| పేజీలు సరిచూసినది | |
| బైండింగు చేసినది | |
| ప్యాకింగు చేసినది | |
| పరిస్థితి | good |